# మిసిమి

*"All that we are is the product of what we have thought,
is "We are what we think." — Dammapada.*

సంపుటి 6 జూలై 1995 సంచిక 72

సంపాదకుడు : **రవీంద్రనాథ్ ఆలపాటి**

## విషయసూచిక

పత్రికా సన్మానము – ముట్నూరి కృష్ణారావు

మనస్తత్త్వ శాస్త్రంలో వెలువడిన ... – డా. ఎస్.వి.ఎస్. రావు

పదకోశాలు – మన కర్తవ్యాలు – చేకూరి రామారావు

రంగాజమ్మ సాక్షిగా ... – సత్తెనపల్లి రామమోహన్‌రావు

తూర్పు పడమరల కలగలుపు – 'మిసిమి' రచనల వర్క్‌షాప్

కావ్యజగత్తు – జి.వి. కృష్ణారావు

ఆచార్యనాగార్జున–మధ్యమక కారిక – ఎమ్. రాజగోపాల రావు

ముఖచిత్రం · **Jami Twins**

ఈ చిత్రంలో జామి కవలలు ఒకే శరీరంతో రెండు రూపాలుగా నృత్యం చేయడం మనకు కన్పిస్తుంది. ఈ కవలల చిత్రం ఖగోళశాస్త్రంలో 'స్త్రీ సంబంధ చిహ్నం'గా పరిగణింపబడుతోంది

చిత్రకారుడు : **షేక్ రహ్మత్ అలీ** - వీరు బి.ఎ ఉత్తీర్ణుడయి, కాలేజీ ఆఫ్ ఫైనార్ట్స్ అండ్ ఆర్కిటెక్చర్, హైదరాబాద్‌లో ఐదేళ్ళ శిక్షణ పొంది 1976లో డిప్లొమా ఇన్ అప్లైడ్ ఆర్ట్స్‌లో ఉత్తమశ్రేణిలో ఉత్తీర్ణుడై, 20 సంవత్సరాలపాటు కమర్షియల్ ఆర్ట్స్ ఫీల్డ్‌లో తనకంటూ ఓ స్థానం సంపాదించుకొన్నాడు. ఈయన డిజైన్స్ U.K, U.S.A, Germany వరకూ చేరాయి.

పెయింటింగ్ ఈయన ప్రత్యేక హాబీ. తైలవర్ణంలో ఈయన చేసిన Portraitsలో ఉద్యోగపతి శ్రీ జి. కిషన్‌రావు Life size Portrait ఎన్నదగినది. ఈయన పెయింటింగ్స్ పెక్కు Private Collections లో ఉన్నాయి.

# డా. జోనాస్ సాల్క్



పోలియో వ్యాధి నిరోధకాన్ని కనుగొన్న సుప్రసిద్ధ శాస్త్రవేత్త డా. జోనాస్ సాల్క్.

డా. జోనాస్ సాల్క్ 1914 అక్టోబర్ 28న న్యూయార్క్ పట్టణంలో జన్మించారు. వీరి తండ్రి ఒక రెడిమేడ్ దుస్తుల దుకాణంలో పనిచేసేవారు. డా. సాల్క్ 1939 లో డొన్నా లిండ్సేను వివాహమాడారు. వీరికి ముగ్గురు కుమారులు కలిగాక 1968లో విడాకులు తీసుకున్నారు. తరువాత 1970లో ప్రపంచ ప్రఖ్యాత చిత్రకారుడు పికాసోకు ఒకప్పటి భార్యయిన ఫ్రాంకాయిస్ గిలాట్‌ను డా. సాల్క్ వివాహమాడారు.

1950 దశకంలో డా. జోనాస్ సాల్క్ పిట్స్‌బర్గ్ యూనివర్సిటీలో పనిచేశారు. ఇక్కడే ఆయన 'పోలియో వాక్సిన్'ను కనుగొని, అమెరికాలోనేకాక యావత్ప్రపంచానికి అభిమాన పాత్రుడయ్యారు. 20వ శతాబ్దపు మొదటి సగభాగంలో అమెరికాలో ఎంతో మంది పోలియో మహమ్మారి బారిన పడ్డారు. తత్ఫలితంగా ఎంతోమంది అంగవికలులయ్యారు. అమెరికాలో 'పోలియో' పేరు వింటేనే అందరూ భయపడే పరిస్థితి నెలకొంది. ఆ సమయంలోనే పోలియో రోగ నిరోధకాన్ని కనుగొనేందుకు నడుంకట్టాడు డా. సాల్క్. ఆయన కృషి ఫలితంగా 1955లో 'పోలియో వాక్సిన్' అవతరించి, పోలియో వ్యాధిని నిరోధించడంలో అద్భుతంగా పనిచేసింది.

''డా. సాల్క్ 'పోలియో వాక్సిన్'ను కనుగొనడం వల్లనే 'ఆరోగ్యమన్నది అందరికీ జన్మహక్కు' అని ఈతరం వారు తెలుసుకొన్నారు. అంతేగాకుండా వైద్యులు ఏ వ్యాధినైనా నిరోధించేందుకు తగిన చికిత్సా విధానం గురించి ఆలోచించ గలుగుతున్నారు'' అని శ్రీమతి జేన్ ఎస్. స్మిత్ తన "Patenting the Sun : Polio, The Salk Vaccine and the Children of the baby boom" అన్న పుస్తకంలో పేర్కొన్నారు.

డా. సాల్క్ 1963లో కాలిఫోర్నియాకు తన మకాం మార్చారు. అక్కడే లా జొల్లాలో ''సాల్క్ ఇన్‌స్టిట్యూట్ ఫర్ బయోలాజికల్ స్టడీస్'' అన్న సంస్థను స్థాపించారు. ఈ సంస్థ ఆర్థిక ఇబ్బందులను ఎదుర్కొంటూనే ఎంతోమంది ప్రఖ్యాత సైంటిస్టులను ప్రపంచానికందించింది. 1984 వరకూ డా. సాల్క్ కాన్సర్ (Cancer) మల్టిపుల్ స్క్లెరోసిస్ (Multiple Sclerosis) వంటి భయంకరమైన రోగాలను నిరోధించేందుకు ఎన్నో ప్రయోగాలు చేస్తూనే ఉన్నారు. ప్రస్తుతం ప్రపంచాన్ని భయకంపితం చేస్తున్న 'ఎయిడ్స్' (AIDS) వ్యాధిని నిరోధించేందుకై 1986లో డా. సాల్క్ ''ఇమ్యూన్ రెస్పాన్స్ కార్పోరేషన్ ఆఫ్ కార్ల్స్‌బాడ్ (Immune Response Corporation of Carlsbad)" అనే సంస్థను నెలకొల్పారు. ఈ సంస్థ ఎయిడ్స్ వ్యాధిని పూర్తిగా నిరోధించలేక పోయినప్పటికీ, ఆ వ్యాధిగ్రస్థులను ఇంకొంతకాలం జీవించేలా చేసే వాక్సిన్‌ను కనిపెట్టింది. డా. సాల్క్ ఎయిడ్స్ వ్యాధిని పూర్తిగా నిర్మూలించే వాక్సిన్‌ను తమ సంస్థ ఖచ్చితంగా కనుగొంటుందనే ఆశాభావంతో ఉండేవారు. ''నేనెప్పటికీ ఆశావాదినే'' అని చెప్పుకునే డా. సాల్క్ 1995 జూన్ 23 న తన 80 ఏట లా జొల్లాలో కన్నుమూశారు.

# పత్రికా సన్మానము

– ముట్నూరి కృష్ణారావు

ఈ సన్మానము, దీర్ఘకాలము నుండి పనిచయుచున్న వను కారణమున కృష్ణాంధ్ర పత్రికల పేరున జరుపబడుచున్నను, తెలుగు పత్రికలన్నిటి శ్రేయము నుద్దేశించి సంకల్పింపబడినదని కార్యదర్శులు చెప్పినందున నా యనంగీకారము నుపసంహరించుకొంటిని ఇంతకు నీ సన్మానము కేవలము అభిమాన పూర్వకమైనదే కాని తెలుగు పత్రికల యభివృద్ధికి సంతృప్తిచెంది చేయబడుచున్నది కాదనుట నిస్సంశయము. తెలుగు పత్రికలలో గొంతవఱకు ఆంధ్ర పత్రిక తప్ప యిక నేవియు జీవకళకలిగి ప్రవర్ధమానములుగ లేవని చెప్పుట యనవసరము. తెలుగు పత్రికల హైన్యస్థితికి ప్రజలు బాధ్యులు కారని మాత్రము చెప్పవలసి యున్నది. విద్యావంతులును, సంస్కారులును పత్రికా నిర్వహణమునకు బూనుకొనక పోవుటచేతనే పత్రికలకు దేశములో దగిన వ్యాప్తికాని పలుకుబడిగాని, లేకున్నవనుట నిజము. వైద్య శాస్త్రమునందు సుశిక్షితులైన గాని డాక్టర్లు ప్రాక్టీసు చేయుటకు యోగ్యత కలుగదు. న్యాయవాదులును వారి శాస్త్రమునందు కొంత పాండిత్యమును తర్ఫీయతును బొందినగాని వారికి పట్టాలు పుట్టవు. టీచర్లకు ఎల్.టీ శిక్షణము విధింపబడినది. కాని ఎడిటర్లగుటకు నెట్టి శిక్షణము అవసరము లేదు. ఒక అచ్చుకూటము, ఒక బేలు కాగితము, ఒక ఊటకలము సమకూడిన చాలును, పత్రికాధిపత్యము సిద్ధించును. **పత్రికా నిర్వహణము చాల బాధ్యతతో గూడిన కార్యము. భాషాప్రభుత్వము, రచనా కౌశలము, భావోద్రేకము ఉన్న చాలవు. క్రమానుగతములైన సంప్రదాయములను, ధారావాహికములైన మరియాదలను గుర్తింపగల చరిత్రజ్ఞానము, ప్రజల నిజ మనోరథములను నిగూఢ చిత్త వృత్తులను బరీక్షింపగల భావనాశక్తి, ప్రపంచ పరిణామ రీతులను బరికింపగల విశాల దృష్టి, దేశ భవితవ్యము నుపలక్షింపగల గంభీర విశ్వాసము, పత్రికాధిపతులు అలవరచుకొన దగిన లక్షణములు. వీనియన్నిటికంటెను గావలసినది నిర్మలమైన సత్యనిరతి.** ఈ లక్షణములు పత్రికా నిర్వాహకులలో జాలవఱకు గొరవడి యుండుటచేతనే, తెలుగు పత్రికలు పొందదగినంత గౌరవమును బొందుట లేదని చెప్పినందుకు సోదర పత్రికాధిపతులు మన్నించెదరు గాక!

పత్రికల యుపకృతితోబాటు, అపకృతిని గూడ దలచుకొనినప్పుడు పత్రికావ్యాప్తి తగినంతగ లేకపోయినదని చింతించుట కవకాశ ముండదు. ఇక్కాలమున ప్రజావబోధనమునకును, ప్రపంచ పరిజ్ఞానమునకును, సామాన్య విద్యా వ్యాపనమునకును, పత్రిక యొుక సాధన మనుటకు సందియము లేదు. కాని ఛాయాతప న్యాయముగ, నీ మేళ్లనంటి కొన్ని కీళ్లు కూడ గలవు. పత్రికా పఠనము మూలమున జ్ఞానప్రదమైన ఉద్గ్రంథావలోకనము క్రమముగ మరుగగుచున్నదని విజ్ఞులకు దెలియని విషయము కాదు. ప్రజలలో గ్రంథావలోకనమే చాల యరుదు. అక్షరాస్యు లే కొలది నిమిషములైనను మేధావులును, జ్ఞాన సంపన్నులును రచించిన ఉత్తమ గ్రంథములను బఠింపక తాత్కాలిక వినోదమును గల్పించు పత్రికలను జదువు అభ్యాస మొుకటి దేశమునందు వ్యాపించుచున్నది. కొందరు యువకులు బలము, పుష్టి, నిచ్చు భోజనమును మాని జిహ్వాచాపల్యమును బురికొల్పు కాఫీ హోటల్సునే శరణ్యముగ జేసుకొని అజీర్ణవ్యాధులకు లోనగుచున్నట్లు, ఆత్మోన్నతికిని, చిత్త సంస్కారమునకును తోడ్పడు ఉద్గ్రంథ పఠనమునకు బ్రత్యామ్నాయముగ బుద్ధి చాపల్య కరములగు పత్రికలను పారాయణము చేయుచుండుటచే చిత్త విభ్రమణములకు లోనగుట సంభవించుచున్నది. పత్రికా పఠనము ప్రజలలో గొంత ప్రబోధమునకు

సాయపడుచున్నను, స్వతంత్ర చింతనా పటిమను బురికొల్ప జాలక పర ప్రత్యయనేయ బుద్ధిని బలపరచుటకే యెక్కువగ నుపకరించుచున్నదని కూడ గొంచెము బరిశీలించిన తెలియగలదు పత్రికల యభిప్రాయములు సహితము భ్రమ ప్రమాదములతో గూడిన వ్యక్తి గతాశయములే యని దెలిసికొనుటకు బదులు, అవి శిరసావహింపదగిన ప్రమాణ వాక్యములుగ జన సామాన్యము స్వీకరించుటకు దగు సందర్భములు కల్పింపబడుచున్నవి. పత్రికలు ప్రజాభిప్రాయ వ్యక్తీకరణమునకు బూనుకొనుచున్నట్లొక యపోహ వ్యాపించి యున్నది. ప్రజాభిప్రాయ మనునది బాహ్యమున స్పష్టముగ నిర్ణీతమై యుండు భావము కాదు. పత్రికాధిపతి తనయొక్కయో, తన పక్షము యొక్కయో, తాత్కాలిక నిర్ణయము సర్వజనామోదము బడయునట్లు చేయుటకు దాని ప్రాశస్త్యమును స్వతంత్ర యుక్తులతో నిరూపించుటకు బదులు, దానిని బ్రజలపై రుద్ధి, వారు నమ్ముచున్న సిద్ధాంతమదియేయను వ్యామోహమును గల్పించుట పత్రికా రచనా నైపుణ్యముగ నెంచబడుచున్నది. అర్చకుడు తన చేతితో చేసిన పసుపుముద్దను విఘ్నేశ్వరునిగ భావించి ధూప దీప నైవేద్యము లొసగునట్లు, పత్రికాధిపతులు స్వకీయాభిప్రాయములను ప్రజాభిప్రాయముగ బ్రతిష్ఠించి పత్రికలలో నూరేగించుట ప్రచారక ధర్మముగ విశ్వసింప బడుచున్నది. ఇది పత్రికలవలంబించుచున్న ''మెస్మరిజము'' పద్ధతి. ఈ మెస్మరిజము మూలమున పత్రికా పాఠకులలో స్వతంత్రాలోచనా శక్తి కుంటుపడక తప్పదు.

ఇంతియ కాదు. పత్రికలు సర్వసామాన్యముగ దేశములోని ఆయా పక్షముల నాశ్రయించుకొనియే ప్రవర్తిల్లుచున్న వనుట లోకవేద్యము. ఒక పక్షమునకే సంబంధించిన పత్రికయందు స్వపక్షమును బలపరచుటకై న్యాయవాదులవలె సత్యమును మరుగుపరచి అబద్ధమును స్ఫురింపజేయు పద్ధతి యెక్కువగనో తక్కువగనో పత్రికాధిపతి యొక్క రచనా చమత్కృతిని బట్టి సహజముగ ప్రయోగ్య మగుచున్నది. ఈ పద్ధతిలో అర్ధోక్తులు, అతిశయోక్తులు, కొన్ని సందర్భములలో అసత్యోక్తులు కూడ బ్రయోగింపబడుటచే సత్యహాని కలుగకుండ నుండ జాలదు. పత్రికా ప్రపంచమంతయు వెదకి జూచిన గాంధి మహాత్ముని ఒక ''యంగు ఇండియా'' తప్ప యీ రాజనీతి నుండి తప్పించుకొన గలిగిన పత్రిక యింకొకటి కలదా యని సంశయింప వలసి వచ్చుచున్నది. పాశ్చాత్య దేశములలోని పత్రికా రాజములు మితిమీరి రాజ్య దురహంకారములను, జాతి ద్వేషములను బురికొల్పి గత యూరోపియను మహా సంగ్రామమునకు గారణ భూతములయ్యెనని ఒక యాధునిక చరిత్రకారుడు వ్రాక్రుచ్చినప్పుడు పత్రికల యపకృతి యెట్టిదో యూహించుకొన వచ్చును మన దేశమునందు రాజకీయ పక్షభేదములు కేవలము రాజకీయముగ నుండక, కుల కక్షలుగను, మత కలహములుగను, బరిణమించుటకు గొంతవఱకు దేశపరిస్థితులు కారణము లైనను, పత్రికలకు గూడ నీ దుస్థితికి గొంత బాధ్యత కలదని ఒప్పుకొనక తప్పదు. ఉత్తర హిందూస్థానములో ఉర్దూ హిందీ పత్రికలే హిందూ మహమ్మదీయ కలహములకు హేతు భూతములని గవర్నమెంటువారు ప్రకటించిన విషయములో గొంత సత్యము కలదు. మన ప్రాంతములలో కుల వైషమ్యములకు పత్రికలెంతవఱకు గారణములో యోచించిన, పత్రికా ప్రచార మీ దేశమునకు గూడ నెందుకు సంక్రమించినదా యని దేశ శ్రేయోభిలాషులు సంతాపపడవలసి యుండును.

యూరపు అమెరికాలలో వలె పత్రికా ప్రకటన మీ దేశములో నింకను వర్తక వ్యాపారముగ బరిణమించి యుండలేదు. పత్రికా ప్రకటనము పెద్ద మూలధనముతో వ్యాపారసరళిని నడిపిన, పత్రికకు స్థిరత్వము లేదు. కాని ఆ పద్ధతివలన పత్రికా స్వాతంత్ర్యముకు భంగకరములగు సందర్భములెన్నియో సంఘటించును. పత్రికలు ధనికులకు, షాహుకారులకు, పెట్టుబడిదారులకు, అమ్ముడు పోయిన యెడల నవి యెంతవఱకు ప్రజోపయోగకరములగుటకు అవకాశముకలదో

యోచింపుడు పత్రికా సంపాదకుడు తన శుద్ధాంతఃకరణ ప్రవృత్తిని బట్టి వ్యాఖ్యానము చేయుటకు వీలుండదు పత్రిక యజమానులను, రాజపోషకులను రంజింపజేయు ఇచ్చకపు వ్రాతలను వ్రాయవలసి యుండును. ఇటీవల స్వదేశ సంస్థానాధీశుల చేతులలో బడిన పత్రికలు కొన్ని తమ తొల్లింటి స్వాతంత్ర్యమును గోలుపోయి, కూలికెట్టి వ్రాతలను బ్రకటించుచున్నవియు లోకమెరుగనిది కాదు వంగ దేశములో గొన్ని బంగాళీ పత్రికలు గవర్నమెంటు సబ్సిడీకి లోబడి యాత్మ గౌరవమును నష్టమొనర్చుకొనినవి వివిధ సంఘములవారు వారి వారి ప్రత్యేక ప్రయోజనముల కొఱకు వేరు వేరు పత్రికలను బెట్టుకొనిన బెట్టుకొందురు గాక! కాని బయట ప్రజల పేరున నడుపునట్లు ప్రకటించుచు, రహస్యముగ ఏ ధనాఢ్యులకో, ఏ జమీందారులకో ఏ సంస్థానాధీశులకో అమ్ముడు పోవుట మాత్రము విచారకరము అట్టి పరిస్థితులీ దేశమునకు గూడ క్రమముగ సంక్రమింప నారంభించుటచే నీ విషయమును సూచించవలసి వచ్చుచున్నది. స్వతంత్రులైన పత్రికాధిపతుల చేతులలో నున్నప్పుడే, స్వాతంత్ర్య భంగకరములగు సందర్భము లెన్నియో సంఘటించుచుండును ఒకమారు పత్రికా కార్యాలయమునకు వచ్చి అక్కడకు జేరు ఉత్తర ప్రత్యుత్తరములను బరీక్షించిన వీని యాంతర్యము తెలియుగలదు. ''నా లేఖను బ్రకటించనందున నా పేరును చందాదారుల పట్టినుండి కొట్టివేయుడు'' అను ఉత్తరములు చాల తరచుగ వచ్చుచుండును ''మా సంఘమునకు బ్రతికూలమైన జాబులను బ్రకటించుచున్నందున మా సాంఘికులచే మీ పత్రికను బహిష్కరింపజేసెద''మని బెదరించుచు వ్రాయువారు కలరు ధనాధిక్యత చేతనో, స్వసంఘాభిమానము చేతనో పలుకుబడి గల ఒక ప్రముఖుని చర్యలను ఖండించవలసిన అవసరమున్నను, అట్లు చేసిన పత్రికకు బ్రజలలో బలుకుబడిపోయి, చందాదారులు తగ్గదరేమోయని బెదరు ఒకవైపు, ఏ విలేఖకుని వ్యాసమో ప్రకటనార్హము గాకపోయినను దానిని ముద్రించకపోయిన వాని యాదరణ పోవునేమో యను జంకు ఇంకొక ప్రక్క, లోపల నిష్టము లేకపోయినను బయటకు ఒక యధికారినో, ఒక ప్రముఖునో, ఒక ధనికునో, బ్రశంసించుచు వ్రాసి మెప్పుబడయవలయునను స్తోత్రాభిలాష యింకొక దిక్కున, ఎంత రోషముతో, ఎంత మోటుగ దిట్టుచు వ్రాసిన ప్రజలు తమ ధైర్య సాహసములను అంత మెచ్చుకొనెదరను కీర్తి కాంక్ష ఇంకొక చక్కిని, స్వాభిమానము చేతనో, స్వపక్షమును సమర్థించుటయందో, విపక్షమును ఖండించుటలోనో కేవల మనాలోచితముగ శమ దమములను వీడి భావోద్రేకమునకు లోనగు చిత్త వికారము ఒక వంకను, పత్రికాధిపతులను బాధించుచుండు విషయములని వారిలో గొంతమందికైనను అనుభవైక వేద్యములు

ఇదంతయు నిట్లుండ, పత్రికలలోని అడ్వర్టయిజుమెంటులు కూడ బత్రికాధిపతులను బాధించు విషయములలో నొకటి పత్రికలు ఏ యర్థాకలితోనైన బ్రతుకుటకు ప్రకటనలే ఆధారములను సంగతి యెల్లరెరిగిన విషయము. వర్తక వ్యాపారములందు బ్రకటనము నవీన విధానములలో నొకటి ప్రజల దృష్టి నెటులైన నాకర్షించి తమ వస్తువులను గొనునట్లు చేయుటయే వాని లక్ష్యము. ఇందు నిమిత్తము ప్రకటనదారులు తమ వస్తువుల ప్రాశస్త్యమును వర్ణించుటకు గావ్య చతురత నంతను జూపెదరు ఎట్టి యతిశయోక్తులను వ్రాయుటకైనను జంకరు. కృత్రిమములైన యోగ్యతా పత్రములను బ్రకటించుటకు వెనుదీయరు ముఖ్యముగ నీ దేశములో నే పరిశ్రమయు అభివృద్ధిలో లేకపోయినను ఔషధముల వ్యాపార మతిశయించినది. వీనిలో నేవి మోసమో, ఏవి గుణము గలవియో, పత్రికాధిపతులు విచక్షణ చేయలేరు కాని ఈ ప్రకటనలు చాలవరకు కేవలము ప్రజలను భ్రమింపజేయుటకు అతిశయోక్తులతో వర్ణింపబడునను సంగతి తెలియనది కాదు. కొన్ని సందర్భములలో వీని భాష జుగుప్సాకరముగ నుండుటయు కద్దు. కవులు

గ్రంథకర్తల వంటి సంస్కారులే యెట్టి మోమోటమియు లేక తమ రచనలను గూర్చి అతిశయోక్తులతో వర్ణించి ప్రకటించుకొనుచున్నప్పుడు ఔషధాలవారు దేవాదిదేవుల పేర్లతో, పురాణేతిహాసాలంకారములతో, చిత్ర విచిత్ర రీతుల వర్ణించి, ప్రజల విశ్వాసము నాకర్షింప గడంగుటలో నాశ్చర్యము లేదు. గాంధీ మహాత్ముని ''యంగు ఇండియా''లో వలె నీ యడ్వర్టయిజుమెంటులను బూర్తిగ విసర్జించుటయే సర్వోత్తమమైన పద్ధతి. కాని యీ పద్ధతి నవలంబించిన పత్రికలన్నియు మ్లానపడక తప్పవు. ఈ ప్రకటనలలో నే గ్రంథములు పరస్వార్థములో, ఏ కంపెనీలు మోసములో, ఏ మందులు కృత్రిమములో, విచక్షణ చేయుట కష్టసాధ్యము. ఇట్లనుటచే నీ విషయములో బత్రికాధిపతుల కెట్టి బాధ్యతయు లేదని గాదు. పత్రికల యపకృతులలో, అడ్వర్టయిజుమెంటుల బాధ యొకటి యని సూచించుటకే యీ విషయము తెలుపబడినది. ఇక రవీంద్రుని వంటి రసభోగి పత్రికలను క్రీగంటనైన జూడడనిన ఆశ్చర్యపడవలసిన పని లేదు.

ఈ యపచారము లనివార్యములు కావు. పత్రికాధిపతులు తమ బాధ్యతను గుర్తించిన కొలదీ. అధికారులును, సంస్కారులును, పత్రికా నిర్వహణమునకు బూనుకొనినకొలదీ దేశములోని రాజకీయ సాంఘిక పరిస్థితులు పరిష్కృతములై ప్రజాశక్తి జాగరితమైనకొలదీ, పత్రికల పలుకుబడి, వశీకరణశక్తి స్వాతంత్ర్య దీప్తి హెచ్చునేకాని తగ్గనేరవు ప్రస్తుతము దేశమునందు ప్రతికూల పరిస్థితులధికముగ నున్నందున తక్కిన సంస్థల వలెనే పత్రికా సంస్థయు గొంత వికృత రూపమును దాల్చి యున్నది. స్వాతంత్ర్యమే పత్రికలకు బ్రాణము. స్వాతంత్ర్య సంస్థాపనమే పత్రికల లక్ష్యము ప్రతి వ్యక్తియందు, ప్రతి సంఘమునందు, ప్రతి జాతియందు స్వాతంత్ర్య బీజములను వెదజల్ల నారంభించినపుడు, ఆరంభ దశలో సమన్వయము కుదరక దేశ సంక్షోభము కలుగుట సహజము దేశమునందు నిద్రాణములై యున్న శక్తులొక్క మారుగ విజృంభించుట తోడనే ప్రతి వ్యక్తియు తన హక్కులను బ్రతిష్ఠింప గోరును. ప్రతి సంఘము ఉన్నత స్థానము నాక్రమింప జూచును ప్రతి జాతియు తన సంపూర్ణ శక్తిని బ్రకటింప నభిలషించును అంతట ప్రాత బాటలకు కట్టుబడిన పూర్వాచార పరాయణులీ సంచలనమును జూచి భీతిల్లుట సహజము వారి నిరోధమే కులకక్షలకు సంఘ వైషమ్యములకు గారణమగును ప్రభుత్వాధికారులును ఆగ్రహ వివశులై కఠిన శాసనములకు గడంగెదరు. దీనికి ఫలితముగ రాజద్రోహము, విప్లవకరములైన ఉద్యమములును, బయల్వెడలును వెనుకటి పూజలు, విధేయతలు, గౌరవములు నిలువనేరవు క్రొత్త భావములు ఝంఝూమారుతముల వలె వీచి భయంకర రూపము దాల్చును. ప్రాత కట్టడములు కూలిపోవును. వెనుకటి యధికారములు భగ్నము లగును. ఎక్కడ జూచినను అశాంతి, అసంతృప్తి, అసహనము, వ్యాకులత, ఉద్వేగము బహిర్గతములగును సంఘములో నెక్కడను స్థిరత్వమును స్థిమితతయు నున్నట్లు కన్పట్టదు. ఏ ప్రతిఘాతమునకో నిద్రాభంగము చెంది బెదరిన మనుజుడు ఇటు అటు పరుగిడునట్లు సంఘ మొక్కమారుగ జాగరిత మగుటచే అధికార ధిక్కారము, శాసనాతిక్రమణము, విద్రోహము, విద్వేషము, మొదలగు సంక్షోభ తరంగములు బయల్వెడలుట సహజము. ప్రాతక్రొత్తల కలయిక, తూర్పు పడమరల రాపిడి, వ్యష్టి సమిష్టుల సంఘర్షణ, పాలక పాల్యుల వైరుధ్యము, దేశమున అపూర్వమైన అల్లకల్లోలమును గలిగించుచున్నవి దేశమంతయు నడుగంట గదలిపోవుచున్నది భరత ఖండములో గదలని ప్రాంతము లేదు పరివర్తనము నొందని జీవన ప్రకరణము లేదు. సర్వ విషయముల యందును తీక్ష్ణ ప్రచండ సమస్య లెదుర్కొనుచున్నవి. ఆత్మ విస్మృతి పొందిన దేశమగుటచే నీ సమస్య లత్యంత గహనము లగుచున్నవి. ఒక వైపున దేశముయొక్క చిరంతన సభ్యతాస్వరూపము నన్వేషించవలసి యున్నది ఇంకొక ప్రక్కను భారత

జాతీయ సమ్మేళనమును నిరూపించి, తత్సిద్ధికి సాధన విధానములను గనుగొనవలసి యున్నది. అనైక్యము నుండి యైక్యము, వైషమ్యముల నుండి సామరస్యము, అశక్తత నుండి సంఘటనాశక్తి, అంధత్వము నుండి జ్ఞాన ప్రతిభ, అభివ్యక్తము సేయుటయెట్లు? రవీంద్రుని వంటి కవిపుంగవులు, అరవిందుని వంటి జ్ఞానయోగులు, గాంధి మహాత్ముని వంటి కర్మవీరులు, జగదీశ చంద్ర బోసునివంటి ప్రకృతి వైజ్ఞానికులు ఈ జాతీయ సాగర మథనమునకు బూనుకొనినారు. భారత సామ్రాజ్య లక్ష్మి రేపో మాపో తన నిండు కళలతో ప్రత్యక్షమగుచున్నది. ఆ మహోదయము ఒక్క భారతవర్షమునకే కాక జగత్తునకంతకును గల్యాణదాయకమై వెలయ గలదు. ఇది కవుల వాసంతిక స్వప్నము కాదు. పత్రికల అతిశయోక్తియు గాదు. ఇది కేవలము ప్రకృతి పొందుచున్న నూతన విలసనము, ఈశ్వర విధానోద్దిష్టమైన విశ్వ పరిణామము. కానియెడల నీ కదలికకు, ఈ కలహములకు, ఈ విద్రోహములకు, ఈ యావేదనలకు, అర్థము లేదు, ప్రయోజనము లేదు, సాఫల్యము లేదు. ఉషఃకాలము ముందు చీకట్లు దట్టమగును వర్షపాతము ముందు గాలిదుమారము రేగును. బీజోత్పత్తి ముందు గడ్డ విరుగును ఫలసిద్ధి ముందు కుసుమదళములు వాడి రాలిపోవును. శిశూదయము ముందు తల్లి ప్రసవవేదన నొందును. అట్లే నూతన భారత జాతీయావతరణమునకై నేడు దేశములోని ప్రతి సంఘము ఆవేదన నొందుచున్నది. ఆ యావేదనయే రాజ్యాంగమునందు స్వరాజ్యాందోళనము ఆ యావేదనయే సంఘమునందు వర్ణవైషమ్యము. ఆ యావేదనయే మతముల యంతఃకలహము. ఆ యావేదనయే పత్రికల యపకృతి వసంతఋతు సమాగమమున చెట్ల యాకులు రాలిపోవునట్లీయపచారములన్నియు రాలిపోగలవు ఆత్మజ్ఞాన విలసితమైన, సృజనశక్తి భరితమైన, వివిధ కళాలంకృతమైన, సర్వాంగ సుందరమైన, జగత్కల్యాణదాయకమైన, ఏక భారత జాతీయ సంస్థాపనమను అతీతధ్యేయమే సన్నిహిత క్లిష్ట పరిస్థితులందు వ్యక్తమగుచున్న ప్రతి స్పర్థయందును, ప్రతి యపచారమునందును, ప్రతి తిరుగుబాటునందును, అంతర్గతముగ, అట్టడుగున, స్పందించుచున్న ప్రాణశక్తియని హృదయస్థము చేసికొనిన, నీ వార్తాపత్రిక లీ సంకటావస్థనుండి బయల్పడి, ప్రజావళిని ఆనంద వారినిధి నోలలాడించు భారత జాతీయ కల్యాణ మహోత్సవాహ్వాన పత్రికలై వెలయగలవు ఈ సన్మానము తెలుగు పత్రికల కట్టి యాశీర్వాద బలము నొసగు గాక!

సీ॥ మ్రోగుచున్నది విశ్వమోహన లోక క
    ల్యాణ తంత్రీముక్త గానరవము
కదలుచున్నవి దేశగర్భ గర్భిత జీవ
    నోదార ఖనులెల్ల పాదు కదలి
ధ్వనియించె గగనంబు ధాత్రీజన స్వర్గ
    యుగ సమాహ్వాన యోగ మనుచు
ఓలగం బున్నవి ఉర్వి నేలెడు తప
    శ్శక్తి సంతతు లెల్ల సంభ్రమమున

ఈ లయాకృతిలోన దా నే మహస్సు
వెడలునో చూడగల్గు సంవిత్ప్ర గరిమ
తెచ్చుకో లేరు కాబోలు తెలుగువారు
అలముకొన్నట్టి యోగ మాయాత్మ జేసి!

కృష్ణా పత్రిక, సెప్టెంబరు 7వ తేది, 1929 సం॥

# మనస్తత్వశాస్త్రంలో వెలువడిన వింత సిద్ధాంతం

- డా. ఎస్.వి.ఎస్. రావు

(BOUNDARIES IN THE MIND - A new psychology of personality -Earnest Hartmann, Basic Books, Harper Collins Publishing House, USA. 1991, pp. 274)

ఇతర విషయాల్లో ఎటువంటి అభిప్రాయ భేదాలున్నా బుద్ధిజీవులందఱు విశ్వవ్యాప్తంగా కవులను, కళాకారులను, సృజనాత్మక శక్తిగల ప్రతిభావంతులను ఉన్నత వ్యక్తులని భావించి గౌరవిస్తారు. పాశ్చాత్య తత్త్వవేత్తలలో అగ్రగణ్యుడైన Kant రసదృష్టి మానవ మేధస్సుకు చెందిన విలక్షణమైన శక్తి (mental category)పై ఆధారపడి యుంటుందని ప్రతిపాదించాడు. భారతీయ అలంకారికుల పరిభాషలో దీన్ని జన్మతః సంక్రమించిన 'వాసన' అన్నారు పాతికేళ్ల క్రితం ఆధునిక జర్మను కవి రిల్కేను గూర్చి చదువుతున్నప్పుడు కళాకారుడు మానవజాతి పరిణామక్రమంలో ముందుగా జన్మించిన అపూర్వవ్యక్తి అని రిల్కే అన్నట్లు జ్ఞాపకం. కాని యిటీవల Hartmann రచించిన Boundaries in the mind అనే గ్రంథం సర్వకాలీనమైన పై అభిప్రాయాన్ని చర్చనీయాంశంగా నిర్దేశిస్తుంది. కళాకారులు ఉన్నతవ్యక్తులు కాదుగదా బాల్యావస్థలో పెరుగుదల నిల్చిపోయిన అల్పసంఖ్యాకులని (Stunted individuals) సూచిస్తుంది. మనస్తత్వశాస్త్రంలో యిటీవల జరుగుతున్న పరిశోధనలు, ఆశ్చర్యకరమైన సిద్ధాంతాలు మేధావులందఱు తెలుసుకోవడం చాలా అవసరం.

Hartmann అమెరికాలో Tufts యూనివర్సిటీ వైద్యసంస్థలో కృషిచేస్తున్న వైజ్ఞానికుడు సుఖనిద్రలోపించి తరచుగా కలలు ముఖ్యంగా పీడకలల వల్ల వైద్యసహాయం అర్థించిన వ్యక్తులు అతని గవేషణకు ఆలంబనం. ఈ తరహా జనంలో గోచరించే సామాన్యలక్షణం భావశబలత. ఆత్మవిశ్వాసం, నిగ్రహం లోపించడం ఒంటరితనానికి బదులు కలుపుగోలుతనం. తమ బాల్యావస్థను గూర్చి చిన్ననాటి జ్ఞాపకాలను గూర్చి మమకారం. సున్నితహృదయులు. సెక్సు విషయంలో కూడ నిజమైన అనురాగానికి ప్రాకులాడడం. దాపరికం ఎరుగని అమాయకులు కాబట్టి చాలా యిబ్బందులకు కూడ జీవితంలో గురి అవుతారు. కాని వీరిలో చాలామంది కవులు, కళాకారులు, నిస్వార్థపరులు, సంఘసేవకులు Hartmann వీరిని 'thin' people (ఆర్ద్రహృదయులు) అని భావించి యిందుకు వ్యతిరేకమైన లక్షణాలు గల 'thick' people (దృఢచిత్తులు) మనోప్రవృత్తిని వివరించేడు. వీరికి కలలు రావడం చాలా అరుదు. వచ్చినా క్షణంలో మరచిపోతారు. తమ బాల్యాన్ని గూర్చి వీరికి ఆలోచన శూన్యం స్నేహం కోసం తహతహలాడరు నిశ్చల చిత్తులు. తమ విశ్వాసాల గూర్చి లక్ష్యాలను గూర్చి పునరాలోచనకు ఆస్కారమే ఉండదు- చాలామంది నూటికి నూరుపాళ్లు స్వార్థపరులు వీరిలో హెచ్చుమంది వ్యాపారస్థులు, లాయర్లు ఇంజనీర్లు యిత్యాదులు. కళాభిరుచి దాదాపు మృగ్యం. సాంఘిక దృష్టి కూడ అత్యల్పం నిద్ర విషయంలో వీరికి సమస్య లేర్పడవచ్చును గాని శారీరకమైన యితర కారణాలనన్వేషించాలంటాడు Hartmann అయితే ఏ వ్యక్తిని యీ రెండు గ్రూపులలోకి ఖచ్చితంగా కేటాయించడం సాధ్యంకాదు. జనబాహుళ్యంలో యీ విభజనకతీతమైన వ్యక్తులను చూస్తాం. వైజ్ఞానికుల్లోనే రెండురకాల వ్యక్తులు కనపడతారు. ప్రతివ్యక్తిలోనూ ఆంతరంగిక సంఘర్షణ సర్వసామాన్యం. ఉదాహరణకు Hartmann తన గ్రంథంలోనే దృఢచిత్తులే అసాధారణ పరిస్థితులలో తమ మనోబలం కోల్పోవడం, బలహీనులే

అవాంతర పరిస్థితులను గట్టెక్కడం గూర్చి ప్రస్తావించాడు Adler సిద్ధాంతం ద్వారా కొందఱు వ్యక్తులను మనం అర్థం చేసుకోవచ్చు. Hartmann సిద్ధాంతం కూడ అతిక్లిష్టమైన మానవ ప్రకృతిని అర్థం చేసుకోవడానికి సలిపిన ప్రయత్నమే ఫ్రాయిడ్ Id, ego, super-ego వంటి అంతస్తులను ప్రతిపాదించినా యీ సరిహద్దులు అభేద్యమైనవి కావని వీటిని గూర్చి వైజ్ఞానిక ప్రయోగాలు అవసరమని భావించాడు

Hartmann సిద్ధాంతాన్ని చర్చించేముందు క్లుప్తంగా మనస్తత్వశాస్త్రంపై ప్రాచీనుల అభిప్రాయాలు, ఆధునిక ప్రయోగాలపై పర్యావలోకనం లాభదాయకం గత శతాబ్దంలో Wundt, Ebbinghans వంటి వైజ్ఞానికులతో శాస్త్రీయ పరిశోధన ప్రారంభమైంది. ఫ్రాయిడ్ సిద్ధాంతం, స్వప్నావస్థపై అతని వ్యాసాలు బుద్ధిజీవులందరికీ పరిచితమే అగాధమైన Unconscious విభాగం కూడ మానవ ప్రవర్తనను నిర్ణయించవచ్చనీ సెక్సు వాంఛ ప్రబలమైనదని ఫ్రాయిడ్ భావన. యుంగ్ (Jung) మానవ స్వభావాన్ని introvert అనీ Extrovert అనీ విభజించాడు సుప్రసిద్ధ అమెరికను తత్త్వవేత్త William James ఆర్ద్రహృదయులను, ఆదర్శవాదులను వంద ఏళ్ళ క్రితమే గుర్తించాడు మన దార్శనికులలో సాంఖ్యులు ఇంద్రియాలు, అహంకారం, బుద్ధి, మనస్సు యిత్యాదులు పరిణామ క్రమంలో ఉద్భవిస్తాయన్నారు కాని చాలవరకు భారతీయ వేదాంతం త్రిగుణాత్మకమైనది మానవ స్వభావాన్ని మూడుగుణాల నిష్పత్తి ద్వారా అర్థం చేసుకునేందుకు యత్నించారు. రజోగుణం అరిష్టదాయకం అన్నారు మనస్సును గూర్చి వేదాంతులు ప్రవచించిన యింకొక ఊహాశిల్పం (model) అన్నకోశం వంటి పొరలను గూర్చి వివరిస్తుంది ఏకంగా నాడీమండలాన్ని అదుపులోకి తెచ్చుకోవడం సాధ్యం అంటుంది యోగసిద్ధాంతం. మానవ స్వభావానికి చర్యలకు జన్మతః సంక్రమించిన మనస్తత్త్వమా లేక పోషణ, స్వీయానుభూతి, కాలధర్మం కారణాలా అని ఎంతైనా చర్చించవచ్చు ఏది ఎలాగైనా యీనాడు మనస్తత్త్వశాస్త్రానికి అమెరికాలో విపరీతమైన గౌరవం ఆసక్తి లభించేయి అందుకు గల కారణాలు తేలికగా ఊహించవచ్చు యాంత్రిక యుగంలో జీవితం అర్థరహితం కావడం నుండి సైకియాట్రిస్టులకు పిచ్చాస్పత్రులకు గిరాకీ పెరిగింది. అదీకాకుండా యీనాడు మన యువతరాన్ని ఆకర్షిస్తున్న Management అనే సరిక్రొత్త శాస్త్రానికి మనస్తత్వ శాస్త్రం పునాది లాంటిది శ్రమ జీవులకు తక్కువ వేతనాలిచ్చి ఎక్కువ పనిచేయించుకొని లాభాలు పొందడానికి వారి మనస్తత్వాన్ని అర్థం చేసుకోవడం అవసరం. అదేవిధంగా వ్యాపార ప్రకటనల ద్వారా సామాన్య ప్రజానీకాన్ని మభ్యపెట్టి అవసరం అనవసరం అనే విచక్షణ లేకుండా తమ సరుకుల నమ్ముకోవడానికి ధనికవర్గం అన్నిమార్గాలను అన్వేషిస్తుంది. Management అంటే కర్రపెత్తనం, వ్యాపారస్థులకు విశ్వాసపాత్రులైన సేవకులై వాళ్లకి అధికలాభాలార్జించడం MBA ల బాధ్యత మనస్తత్వశాస్త్రం నిరుపయోగమని నా అభిమతం కాదు మానసికరోగుల చికిత్సకు చాలా అవసరం. విద్యాబోధన (Education) వంటి రంగాల్లో సైకాలజీకి ప్రముఖ స్థానం ఉంది కాని యీనాడు కేపిటలిస్టు సమాజంలో వ్యాపారస్థులకు, రాజకీయనాయకులకే ఎక్కువగా ఉపయోగపడుతోంది.

ప్రస్తుతం Hartmann గ్రంధం పరిశీలించడం అవసరం కలలను గూర్చి ముఖ్యంగా పీడకలలను గూర్చి తన సలహా నర్థించిన వ్యక్తులను సర్వసామాన్యముగా మనోవైకల్యాన్ని గుర్తించడానికి అవసరమైన పరీక్షలనన్నిటినీ కొనసాగించక thick and thin అని తానూహించిన సిద్ధాంతాన్ని నిరూపించడానికి వైజ్ఞానిక సాధనాలనన్నిటినీ వినియోగించాడు DSM-III (Diagnostic and Statistical model of Mental Disorder) టెక్నిక్ వల్ల ప్రయోజనం లేకపోయింది. తన పేషంట్లు సున్నిత హృదయులని మాత్రమే గ్రహించగలిగేడు Rohrschach కార్డులు వగైరా ఏ ఫలితాన్ని యివ్వలేదు గత ఏభయి ఏళ్ల నుండి అమెరికా కెనడా దేశాల్లో విరివిగా ఉపయోగిస్తున్న MMPI (Minnesota Multiphasic Personality Inventory) పరీక్ష కూడా ఆశించిన ఫలితాన్ని

అందజేయలేకపోయింది. అందువల్ల 145 ప్రశ్నలతో తానే స్వయంగా వారి మనస్తత్వాన్ని కనుక్కునేందుకు ప్రయత్నించాడు. తన విభజనకు అనువైన ప్రతినిధులను 20 మందిని చెరో గ్రూపులోను ఎన్నుకొని దృఢచిత్తులకు ఆర్ద్రహృదయులకు గల వ్యత్యాసాన్ని పరిశోధించాడు తన సిద్ధాంతానికి బలమైన ఆధారం లభించింది P < 0001 స్థాయిలో కలలు రావడానికీ భావశబలతకు అనుబంధం (Correlation) కనిపించినా గణితశాస్త్రం యీ ప్రయోగాన్ని అంగీకరిస్తుందా అని నా సందేహం ఈ రెండు గ్రూపుల సగటు వయస్సులో తేడా ఉంది (51/36). స్త్రీలు, పురుషులు సంఖ్యలో వ్యత్యాసం అత్యధికం (6/17). స్త్రీల మనస్తత్వమే వేరని వైజ్ఞానికుల నమ్మకం ఇరవై మందితో పరిశోధన సాధారణంగా విశ్వసనీయం కాదు. అయినప్పటికి Hartmann యితర ఆధారాలు ఎన్నిటినో సేకరించాడు. ఇటీవల నిద్రావస్థను REM నిద్ర అనీ (Rapid Eye Movement), Non-REM నిద్ర అనీ శాస్త్రజ్ఞులు విభజించారు. REM నిద్రలోనే కలలు కనడం సహజం. 1985లో Watson కనుగొన్న PIPS (Phasic integrated Potentials) అనే భౌతిక చిహ్నాలు Polysomnogram technique ద్వారా పరీక్షిస్తే భావుకులకూ, దృఢచిత్తులకూ గల భేదం స్ఫుటంగా కనపడింది. మెదడులో Nor-ephinephrine వంటి రసాయన పదార్థాలు లోపించడం కారణం కావచ్చును. అదే విధంగా అతిశీతలాన్నీ తాపాన్నీ శరీరం గుర్తించగల శక్తిలో కూడా యీ thick and thin వ్యక్తులలో 0 01 డిగ్రీ మేరకు వ్యత్యాసం కనపడింది. చర్మంలో విద్యుత్ప్రవాహనిరోధక శక్తిని (Electrical Conductance) కూడ Hartmann తన సిద్ధాంతాన్ని నిరూపించడానికి ఉపయోగించుకున్నాడు. తదనంతరం యీ సరిహద్దులు శాశ్వతం కావన్నాడు. వీటిపై పనిచేసే Cocaine వంటి రసాయన పదార్థాలకు కొందరు మేధావులు, కళాకారులు అలవాటుపడడం చాన్నాళ్ల నుండి ఉన్నా LSD చాలా ప్రమాదకరమైన పరిస్థితులకు దారితీసింది.

Hartmann కలలపై జరిపిన పరిశోధన కాదు మేధావులకు యీ గ్రంథం ద్వారా వెలువడిన ఫలితం. కళాకారులకు సామాన్యమానవులకు గల వ్యత్యాసం Brain Structure లోనే ఉండవచ్చనే Hartmann ప్రతిపాదన ముఖ్యాంశం. ఇది ఆశ్చర్యకరమైన విషయమే. ఆధునిక కంప్యూటర్లను మించిన మానవ మేధస్సులో 1000 నుండి 5000 కోట్ల నాడులు ఉండవచ్చునని శాస్త్రజ్ఞుల అంచనా. ఇన్ని నరాల మధ్య గల 1000 కోట్ల linkages మానవ శరీరాన్ని శాసిస్తాయి. ఈ లింకులు బాల్యంలో 5 నుండి 15 సంవత్సరాల పెరుగుదలలో తగ్గుతూ వస్తాయని వైజ్ఞానిక ప్రయోగాల ద్వారా ఋజువైంది. అంటే వయస్సు పెరిగినకొద్దీ మెదడులో ద్రవస్థితి నుండి ఘనీభవించిన స్థితి ఏర్పడుతుంది అన్నమాట. కళాకారులు, సంఘసేవకులు, ఆదర్శవాదులు బాల్యావస్థలో నిల్చిపోయిన (Arrested Physical Growth) అల్ప సంఖ్యాకులని భావించాలి. గ్రంథం చిట్టచివర Hartmann ప్రస్తావించిన ఆధునిక మనస్తత్త్వశాస్త్ర పరిశోధనల గూర్చి విద్యావంతులు ముఖ్యంగా వైజ్ఞానికులు తెలుసుకోవడం చాలా అవసరం. G. Edelman అనే శాస్త్రజ్ఞుడు 1989లోనే A Biological Theory of Consciousness అనే సిద్ధాంతాన్ని ప్రతిపాదించినట్లు కనపడుతుంది.

చివరవమాటగా Hartmann సిద్ధాంతం మన సమాజానికి వర్తిస్తుందా అని కూడా ఆలోచించాలి నిజమైన కళాకారులనూ, ఆర్ద్రహృదయులనూ మన మధ్య గుర్తించడం కష్టం అభివృద్ధి చెందిన దేశాల్లో మనఃప్రవృత్తిని బట్టీ అభిరుచులను బట్టీ వారి వారి వృత్తులను నిర్ణయించుకునేందుకు అవకాశాలు లభిస్తాయి డొనేషన్లు కట్టి కాలేజీల్లో చేరే డాక్టర్లు, ఇంజనీర్లు, ట్యూషన్ల ద్వారా డబ్బు ఆర్జించే ఉపాధ్యాయులు, బ్రతుకుతెరువుకోసం వైజ్ఞానిక రంగంలో ప్రవేశించిన శాస్త్రజ్ఞులు, ధనమే ప్రధానమని భావించే నటీనటులు నిజాయితీపరులా అనే విషయం సంశయాస్పదం

# పదకోశాలు–మన కర్తవ్యాలు

– చేకూరి రామారావు

భాషాశాస్త్ర పార్య గ్రంథాల్లో భాషా నిర్వచనాలను చదువుకున్న చాలామంది వాటిలో వైవిధ్యాన్ని గమనించే ఉంటారు అవేవీ సమగ్రాలు కావని కూడా గుర్తించే ఉంటారు అయితే అవి తప్పులు కూడా కావు ప్రతి నిర్వచనమూ భాషను గురించి ఏదో ఒక అంశాన్ని పురస్కరిస్తుంది నిజానికి ఏ శాస్త్రంలోనూ ఏ నిర్వచనమూ సమగ్రం కాదు ఎప్పటికీ అందుకోలేని లక్ష్యం సమగ్ర నిర్వచనం. అయితే ఎప్పటికీ యత్నించటం మానని లక్ష్యం కూడా ఇది ఈ పరిమితిని విస్మరించకుండా ప్రస్తుత సందర్భానికి పనికొచ్చే నిర్వచనం (working definition) ఒకటి ప్రతిపాదిస్తున్నాను. అరిస్టాటిల్ చెప్పినట్టు 'నిర్వచనాలను బద్దలు కొట్టటం తేలిక, కొత్త నిర్వచనం చెయ్యటం కష్టం' అయినా నిర్వచనాలు చెయ్యటం మానం.

**నిర్వచనం :** 'మాటల అర్థవంతమైన కూర్పు భాష'

ఇది బ్రహ్మాండాన్ని బద్దలు కొట్టే నిర్వచనమేమీ కాదు కాని ప్రస్తుతం మన అవసరానికి పనికొస్తుంది భాషావ్యవహారంలో మాటలుంటాయి మాటలు ధ్వనిరూపంలో వినపడతాయి. రాత ఉన్న సమాజాల్లో అక్షరాల రూపంలో కనపడతాయి (కనపడని, వినపడని వారికి వారికోసం తయారుచేసిన 'బ్రెయిలీ లిపి'ని స్పర్శ ద్వారా గ్రహిస్తారు) మాటలు అర్థబోధ కలిగిస్తాయి ఈ మాటలను కొన్ని వర్గాలుగా విభజిస్తారు ఈ వర్గాలను కొన్ని నిర్ణీత పద్ధతుల్లో కూరిస్తే అర్థవంతమైన వాక్యాలు వస్తాయి

నిర్ణీత పద్ధతుల్లో చేసే పదాల కూర్పునే వ్యాకరణం అంటారు మాటల నిధిని నిఘంటువు అంటారు. ఇంకో రకంగా చెపితే భాష అంటే నిఘంటు వ్యాకరణాల సంప్రయోగం వ్యాకరణ నిర్మాణ సూత్రాలు అమూర్తం భాషావ్యవహర్త భాషాగ్రహణ క్రమంలో ఈ సూత్రాలను ఏర్పరచుకుంటాడు ఈ వ్యాకరణ సూత్రాలను నిర్మించుకోవటం ద్వారానే వ్యవహర్త భాషా వ్యవహారం చెయ్యగలుగుతున్నాడని ఇటీవలి భాషాపరిశోధకులు నమ్ముతున్నారు. వ్యవహర్త భాషాప్రయోగ దక్షతకు అతను నిర్మించుకున్న వ్యాకరణమే మూలభూతం ఈ వ్యాకరణ స్వరూపాన్ని ప్రత్యక్షంగా దర్శించలేము పరోక్షంగా గ్రహించవలసిందే అందుకే, దీన్ని మనోవ్యాకరణం అందాం ఈ మనోవ్యాకరణం ఏ రూపంలో ఉందో, సూత్రాలు ఎట్లా ఉంటాయో, దాన్ని వ్యవహర్త భాషాప్రయోగంలో ఏ విధంగా ఉపయోగించుకుంటాడో ప్రత్యక్షంగా పరిశీలించే మార్గాలు లేవు కాని ఇట్లాంటి వ్యాకరణం ఒకటి మనుష్య మనఃకుహరంలో లేకపోతే భాషా వ్యవహారమే సాగదు. సూక్ష్మాంశాల్లో విభేదాలు చాలా ఉన్నా, ఈ ప్రతిపాదనను భాషాపరిశోధకులంతా నమ్ముతున్నారు.

ఈ మనో వ్యాకరణం ప్రత్యక్ష పరిశీలన దృష్టం కాకపోయినా దీని మనుగడకు పరోక్షసాక్ష్యాలు చాలా ఉన్నాయి పరివర్తన సిద్ధాంత కర్తలు, బాల్యభాషాగ్రహణ క్రమ పరిశోధకులు ఈ సాక్ష్యాలను తమ రచనలలో బహుళంగా ప్రదర్శించారు భాషాపరిశోధకులు తమ పరిశోధనకు ఈ మనోవ్యాకరణంతో సరితూగగలిగిన వ్యాకరణ గ్రంథాన్ని రచించటమే తమ లక్ష్యంగా గ్రహించారు. ఈ గ్రంథానికీ, వ్యవహర్త నిర్మించుకున్న మనోవ్యాకరణానికీ బింబ-ప్రతిబింబ భావం లేదు

భాషాపరిశోధకుడి భౌతిక వ్యాకరణానికి స్థల-కాల సందర్భ సంబంధ పరిమితులు చాలా ఉంటాయి మనోవ్యాకరణానికి ఇట్లాంటివేమీ ఉండవు భౌతిక వ్యాకరణం మనో వ్యాకరణానికి స్వతంత్ర రూపకల్పన (model building) మాత్రమే ఒక ఊహాప్రతిపాదన (hypothesis) మాత్రమే. వ్యవహర్తకు భాష తెలుసు అంటే అతనికి అవ్యక్తంగా వ్యాకరణం తెలుసన్న మాట

భాషలో మాటలు లేకపోతే వాటిని కూర్చటం ఉండదు. అంటే వ్యాకరణం ఉండదు మాటలకు ధ్వని స్వరూపం ఉంటుంది అర్థబోధ ఉంటుంది వాక్య నిర్మాణంలో ప్రమేయం ఉన్న వ్యాకరణ లక్షణాలుంటాయి ఇవన్నీ కలిస్తేనే మాటలు అవుతాయి

ఈ మాటల్ని సంస్కృతంలో పదాలంటారు. ప్రత్యయ విశిష్టమై ప్రయోగార్హమైన శబ్దాలకే పదం వ్యవహారంలో ఉంది మాటలు అనే మాటకు ఇంతకన్నా విస్తృతార్థాలున్నాయి (చూ సి.పి (బ్రౌను, గెలెటీ నిఘంటువులు) నిజానికి ఈ వ్యాసంలో అంత విస్తృతార్థంలోనూ వాడటం లేదు పదం, అపదం, ప్రత్యయం, మొ. వాటికి కొన్నిటికీ 'మాట' వాడుతున్నాను దీన్ని దాదాపు నోమ్ ఛోమ్‌స్కీగారు వాడిన formative అనే అర్థంలో వాడుతున్నాను

వ్యాకరణం ఎందుకు రచించాలి అనే ప్రశ్నకు చాలా సమాధానాలున్నాయి అందులో ఒకటి వ్యవహర్తకు వ్యాకరణ పరిజ్ఞానం (అవ్యక్తంగానే అనుకోండి) ఉంది గనక నిఘంటు రచన ఎందుకు చెయ్యాలి అనే దానికి కూడా అదే సమాధానం వర్తిస్తుంది అంతేకాదు, పిల్లల భాషాసంపాదనలో మొదట నేర్చుకునేవి మాటలే, మాటల వైఖరీ భేదాలే వాక్యాల్లో నామ క్రియాది భేదాలుగా ప్రవర్తిస్తాయి. కర్త, కర్మ వంటి వాక్య ప్రయోగంలో వచ్చే సంబంధాలకు మాటలు కావాలి మాటలుంటేనే ధ్వనులుంటాయి, వర్ణాలుంటాయి, పదాలుంటాయి, వాక్యాలుంటాయి అందువల్ల మాటలులేనిదే భాష లేదు. అందుకే తెలుగులో మాట అంటే మాటే కాదు భాషావ్యవహారమంతా. utterance, sentence, information, discourse అనే అర్థాలు కూడా తెలుగులో మాటకు ఉన్నాయి

మాటకున్న మరీ విస్తృతార్థాల జోలికి ప్రస్తుతం పోకుండా, మరీ సంకుచితార్థానికి పరిమితం కాకుండా సొంత అర్థబోధ ఉన్న శబ్దాలూ, శబ్ద సంయోజనలూ మాటలనుకుందాం పదాలూ, అపదాలూ, జాతీయాలూ మాటలే అవుతాయి పిల్లి, ఎలుక, మనసు, ప్రేమ, అను, అనుకొను, విను, వినపడు, ఎగబడు, లే, కదా!, కాలుజారు, నోరుజారు, మస్కాకొట్టు, వాగుడుకాయ, వాగుబోతు, తిరుగుబోతు, - ఇట్లా చాలా రకాల మాటలున్నాయి. ఈ మాటలకు ధ్వనిస్వరూపం ఉంది వ్యాకరణ లక్షణాలున్నాయి, సొంత అర్థబోధ ఉంది ఇవన్నీ వ్యవహర్తకు తెలుసు కాబట్టి ఇవి వ్యవహర్త మనఃపద నిధి (lexicon) లో భాగం

అంతేకాదు, పదానికి రూపభేదాలుంటాయి రూపాంతరాలుంటాయి సమానార్థక శబ్దాల మధ్య అర్థచ్ఛాయా భేదాలూ, ప్రయోగ భేదాలుంటాయి పదాలకు ప్రత్యేకమైన విలువలుంటాయి కొన్నింటికి గౌరవభాజనలో తేడాలుంటాయి మరికొన్నిటి మధ్య సౌందర్య స్పర్శలో తేడాలుంటాయి సమాచారమంతా వ్యవహర్తకు తెలుసు అయినా వ్యవహర్త కేవలం అభిప్రాయ ప్రకటనకే భాషను వాడడు. సౌందర్య దృష్టితో వాడతాడు, సందర్భ శుద్ధితో వాడతాడు గౌరవ న్యూనతా వ్యక్తీకరణలో తేడాలుంటాయి తన భావావేశాన్ని మాటల్లో నింపవచ్చు మాటలు విషాద భరితం కావచ్చు, హాస్యస్ఫోరకం కావచ్చు

ఈ భేదాలన్నీ వ్యవహర్తకు తెలుసు అంటే అతని మనఃపదనిధిలో భాగం అన్నమాట పత్రికల్లో పార్టీనాయకుడు అనే అర్థంలో అధినేత అని వాడుతున్నారు రెంటికీ ఒకే అర్థం అయినా స్ఫూర్తి ఒకటి కాదు అధినేత అనే మాటలో ఇతరుల మాటలను లక్ష్యపెట్టని అప్రజాస్వామికనాయకుడు అనే అర్థం ఇమిడి ఉంది. అడిగాడు, ముష్టి ఎత్తాడు అనేవాటికి అర్థం ఒకటైనా రెండోదాంట్లో న్యూనతాభావం ఉంది వచ్చారు-విచ్చేశారు అనే మాటలకు అర్థం ఒకటైనా రెండోదానికి గౌరవ వ్యక్తీకరణ ఉంది. 'మల్లీశ్వరి' పాటలో 'అందెల రవళుల సందడి మరిమరి' అన్నచోట 'అందెల మ్రోతల సందడి మరిమరి' అంటే రెంటినీ పోల్చిన శ్రోతలు - వాళ్లకి సౌందర్య దృష్టి ఉంటే - రెండోదాన్ని నిరాదరిస్తారు ఆమె అందగత్తె అన్నా ఆమె రంభ అన్నా అర్థం ఒకటే, రెండోదాంట్లో వక్తభావావేశం కనిపిస్తుంది. ఒక సంఘటనను వర్ణించేటప్పుడు అది విచారకరం అన్న దానికీ అది దారుణం అన్న దానికీ వ్యక్తి వ్యక్తీకరించే భావావేశంలో భేదం ఉంది. మాటలకు - అర్థాలు సర్వస్వతంత్రం కాదు మిగతా మాటల అర్థాలతో సామ్య సంబంధాలూ, భేదక సంబంధాలూ ఉంటాయి ఇవన్నీ ఎరిగి మాట్లాడే వ్యవహర్తలున్నారు. అంటే ఈ సమాచారమంతా వ్యవహర్త మనఃపదనిధిలో భాగమేనన్న మాట

ఒక ధాతువు నుంచి భిన్నపదాలు నిష్పన్నమవుతాయి. ఈ పద్ధతి సంస్కృతంలో ఎక్కువ. కృ ధాతువు నుంచి కరణము, కారకము, క్రియ, కర్త, కర్మ, కృత అనే రూపాలు నిష్పన్నమవుతాయి. ఈ మాటల మధ్య రూపసామ్య, అర్థసామ్య సంబంధాలు వ్యవహర్తకు తెలిసి ఉండాలి ఒక మాటకు భిన్నార్థాలు, భిన్న పదాలకు సమానార్థాలూ ప్రతిభాషలోనూ కనిపిస్తాయి ఇవీ వ్యవహర్త జ్ఞానంలో భాగాలే అంతేకాక పదాల మధ్య అనుప్రాస (Rhyming) సంబంధాలు కూడా వ్యవహర్తకు తెలుసుననటానికి కొన్ని నిదర్శనాలు, ముఖ్యంగా సామెతల్లో అనుప్రాసలు, అక్షర సమతౌల్యం ఉన్న పదప్రయోగం కనిపిస్తుంది

**1. సన్న గుడ్డ చినిగినా అందం, చక్కనమ్మ చిక్కినా అందం**

**2. ఆస్తిమూరెడు, ఆశబారెడు** అనే సామెతల్లో అక్షర పరిమాణ సామ్యం మాత్రా సమత్వం అంత్యవర్ణ సామ్యం గమనించదగింది. చాలా సామెతల్లో ఈ రకమైన ధ్వని సామ్యం, అక్షర సమత్వం కనిపిస్తుంది.

ఒక వస్తువు గురించి చెప్పటానికి మరొక వస్తువును సాదృశ్యంగా గ్రహించే పద్ధతి ఒకటి ఉంది. దీన్ని సదృశీకరణం (metaphorization) అని వ్యవహరిస్తున్నాను ఇది కవిత్వ భాషలో ప్రచురంగా ఉన్నా సాధారణ భాషలో కూడా తరచు కనిపిస్తుంది

ఏ భాషలో అయినా కొత్త అవసరాలకు కొత్త పదాలు ఏర్పర్చుకోవాల్సి ఉంటుంది. దానికి ప్రపంచ వ్యాప్తంగా కొన్ని మార్గాలుంటాయి కొన్ని భాషలకు కొన్ని విషయాల్లో అదనపు సౌకర్యాలూ ఉన్నాయి. నామాలను క్రియలుగానూ, క్రియలను నామాలుగానూ చేసే ప్రక్రియ అన్ని భాషల్లో ఉన్నది తెలుగులో క్రియల నుంచి నామాలను ప్రత్యయాల ద్వారా తయారుచేసుకుంటాం వీటిలో కొన్ని చారిత్రకంగా ఏర్పడ్డాయి. కొన్ని ఇప్పటికీ వాడుకుంటున్నాం ఎక్కువ భాగం అల్పోత్పాదకాలు

విశేషణాల నుంచి నామాల తయారీ అధికోత్పాదక ప్రక్రియగా కనిపిస్తుంది. తనం అనే ప్రత్యయంతో ఏ విశేషణాన్నైనా నామంగా మార్చవచ్చు ఏ నామం నుంచైనా మరో నామం సృజించవచ్చు మంచితనం, చెడ్డతనం, పిసినారితనం, తెలుగుదనం, పనివాడితనం, సిగ్గులేనితనం,

మంచి దక్కించుకోలేనితనం, - అన్ని ప్రత్యయాలకూ ఇంత ఉత్పాదకశక్తి ఉండదు ఇక నామాల నుంచి క్రియలు రకరకాల పద్ధతులతో ఏర్పడతాయి గాని వాటి ఉత్పాదకశక్తి (productivity) పరిమితం. ఇంగ్లీషులో ఏ నామాన్నయినా నిరభ్యంతరంగా క్రియగా వాడవచ్చు చిన్నపిల్లల భాషలో ఇట్లాంటి క్రియలు చాలా తరచుగా కనిపిస్తాయి.

కొత్తపదాలు ఏర్పరచుకొనే మరో పద్ధతి పదంలో ఒక భాగాన్ని విరిచి దానికో అర్థాన్నిచ్చి కొత్త పదాలు ఏర్పరచటం. Hamburgలో వాడే ఒక Sandwich ని Hamburger అంటారు దాన్ని తప్పుగా విరిచి fishburger అని అమెరికన్లు తయారుచేసుకున్నారు Sputnik అనే రష్యను మాటను విరిచి dognik, flopnik, goofnik, oopsnik వంటి మాటలు అమెరికన్లు తయారుచేసుకున్నారు. ఈ పద్ధతి తెలుగువంటి భాషకున్నట్టు లేదు.

తెలుగులో అత్యంతం ఉపయోగించే పద్ధతి సమాస కల్పన (compounding) పిల్లల భాషలో ఈ పద్ధతి పదకల్పన అధికంగా ఉంటుంది. డబుల్ డెక్కర్‌కు మేడ బస్సు అనీ, కోడిగుడ్డుకు కోడికాయ అని పిల్లలు అనటం విన్నాను. ఈ మాటలు తెలుగులో స్థిరపడేవి కావు. అన్ని భాషలలోనూ ఈ పద్ధతి ఉంది సమాసంలో ఇన్ని పదాలే ఉండాలనే నియమం లేదు. అయితే పదాల సంఖ్య పెరిగిన కొద్దీ ఉత్పాదక శక్తి తగ్గుతుంది నేతి అనంతరామ శాస్త్రి చేసిన శ్రీనాధభాషా పరిశీలనలో శ్రీనాథుడి రచనలన్నిటిలో నుంచి లెక్కపెడితే మొత్తం సమాసాలు 2, 842 అయితే అందులో రెండంశాల సమాసాలు 2,136, మూడంశాల సమాసాలు 549, నాలుగంశాలు సమాసాలు 126, ఐదంశాల సమాసాలు 28, ఆరంశాల సమాసాలు 3 (ఈ సంఖ్య తెలుగు మాటలకు మాత్రమే) అందువల్ల దాదాపు ఏ రెండు మాటలనైనా కలిపి సమాసం చెయ్యవచ్చునన్నమాట. ఏ నిఘంటువులో సమాసాల లెక్క తీసినా దాదాపు ఈ నిష్పత్తిలోనే ఉంటాయనుకుంటా అర్థసంబంధాలు కూడా విభిన్నంగా ఉంటాయి

తెలుగు విశ్వవిద్యాలయం వారి పత్రికాభాషా నిఘంటువులో కొన్ని సమాసాలు చూడండి. 'అధికార తీర్మానం' అంటే అధికార పార్టీ ప్రవేశపెట్టే తీర్మానం, 'అధికార దాహం' అంటే అధికారం కోసం పడేతపన, 'అధికార దుర్వినియోగం', అంటే అధికారాన్ని అపసవ్యంగా ప్రయోగించటం, 'అధికార నివాసం' అంటే పదవిలో ఉన్నవారి నివాసగృహాలు, 'అధికార పర్యటన' అంటే ప్రభుత్వాధికారులు ప్రభుత్వ విధులపై చేసే ప్రయాణం, 'అధికార పీఠం' అంటే ప్రభుత్వపదవి, 'అధికార భాష' అంటే ప్రభుత్వ వ్యవహారాలకు వాడేభాష, 'అధికార వార్త' అంటే ప్రభుత్వం ప్రకటించే వార్త, 'అధికార సమావేశం' అంటే ప్రభుత్వోద్యోగులు విధి నిర్వహణలో జరిపే సమావేశం – ఇట్లా 'అధికార' అనే మాటతో ఏర్పడ్డ సమాసాలు పరిశీలిస్తే వివిధ సంబంధాలు గోచరిస్తాయి.

మానవుల మనఃపద కోశంలో పదాలతో పదాలు తయారుచేసే పద నిర్మాణ సాధనాలు (మాటల కొరముట్లు) కూడా ఉంటాయని పై పరిశీలన తెలియజేస్తున్నది

ఈ మనఃపదకోశంలో పదాలు మనం అలవాటుపడ్డ కోశాల్లోలాగా అకారాది క్రమంలో ఉంటాయా? ఈ కోశంలో పదాలక్రమం ఎట్లా ఉంటుందో గ్రహించే మార్గాలు లేవు అకారాది క్రమం మనం సమాజ సంస్కృతిలో నేర్చుకున్న ఒక పద్ధతి ఈ పద్ధతి మనం స్కూళ్ళలో సంప్రదాయం నుంచి నేర్చుకున్న పద్ధతి మనఃపదకోశం ఇట్లాగే ఉంటుందని చెప్పే ఆధారాలు లేవు.

మనం మాట్లాడే భాషను పరిశీలిస్తే కొన్ని మాటలను విరివిగా వాడతామనీ, మరికొన్ని మాటలను అరుదుగా వాడతామని మనకే తెలుస్తుంది మన మనఃకోశంలో విరివిగా మాట్లాడే మాటలు బాగా అందుబాటులో ఉండేటట్టు, అరుదుగా వాడే మాటలు అడుగున ఉండేటట్టు ఏర్పాటయిందా? కొన్ని రకాల పరీక్షలు ఆ విధమైన ఏర్పాటు ఉన్నట్టు సూచిస్తున్నాయి.

అట్లాగే పదాది సామ్యాలను, పదాంత సామ్యాలను వ్యవహర్తలు త్వరగా గుర్తిస్తారు. తెలుగు సామెతల్లో యతి, ప్రాస, అనుప్రాస, అంత్యాను ప్రాసలు ఈ రకమైన ఊహలకు అవకాశం ఇస్తున్నాయి.

భాషా నిర్మాణ దక్షతను ఛామ్‌స్కీ (competence) అన్నాడు. సామాజిక భాషాశాస్త్రజ్ఞులు నిర్మాణ దక్షత (grammar competence)తో పాటు ప్రయోగ దక్షత (communicative competence)ను ప్రవేశపెట్టారు. ఈ దక్షత వ్యవహర్తలందరికీ సమానమని ఛోమ్‌స్కీ ఉద్దేశించాడు. కాని ఇతరులు విభేదించారు. నిర్మాణ దక్షత తరవాత ఈ దక్షతలో తరతమ భేదాలను గుర్తించాల్సి ఉంటుంది. ఒకే భాషా వ్యవహర్తలు కొందరు ఆకర్షణీయంగా మాట్లాడతారు, కొందరు హేతుబద్ధంగా మాట్లాడతారు, కొందరు నట్లుపడుతూ సరియైన పదాలు వెతుక్కుంటూ మాట్లాడతారు. కొందరికి పదప్రయోగంలో నేర్పుంటుంది కొందరికి అప్రాసంలో, మరికొందరికి సదృశీకరణంలో, ఇంకొందరికి పదగుంఫనలో, ఇంకొందరికి సామెతల ప్రయోగంలో నేర్పు ఉండవచ్చు. భాషల మధ్య నిర్మాణ భేదాలుండుట ఎంత సహజమో వ్యవహర్తల మధ్య దక్షత భేదాలుండటం అంత సహజమే. లిఖిత వ్యవహార సమాజాల్లో (literate societies) ఈ భేదాలు ఇంకా ఎక్కువ ఉంటాయి భారత సమాజంలో సంపూర్ణ మౌఖిక వ్యవహారం మీద ఆధారపడ్డవాళ్ల నుంచి లిఖిత సాహిత్య పరిచయం ఉన్నవాళ్ల వరకు ఉన్నారు. వాళ్ల దక్షతలో ఈ భేదాలుంటాయి తెలుగులాంటి భాషే తీసుకుంటే సాహిత్య ప్రవేశం ఉన్నవారి భాషాప్రయోగానికి, ఇతరుల భాషాప్రయోగానికి ముఖ్యంగా పదప్రయోగంలోనే భేదం ఉంటుంది.

సాహిత్య గంధం ఉన్నవాళ్లు కొన్ని సందర్భాల్లో సాహిత్య భాషాపదాలు వాడతారు. మాట్లాడేభాషలో వాడేమాట లన్నీ రాతలో వాడరు వేరే పర్యాయ పదాలు వాడతారు. అప్పుడు ఆ వ్యవహర్తల భాషలో ఉన్నత వర్గ పదాలు, సామాన్యవర్గ పదాలు అనే విభాగం ఉన్నదన్న మాట! ఈ భేదం లేనివాళ్లు కూడా ఉండవచ్చు ఈ విభాగం వాళ్ల మనఃపదకోశంలో ఉండాలి

మన ప్రాచీన వ్యాకరణాల్లో తత్సమ, తత్సమేతర పదవిభాగం ఉంది తత్సమ - తత్సమేతర పదాల విభాగం సమాస రచనకు, బహువచన నిర్మాణాది సూత్రప్రవర్తనకు అవసరం. ఇది కూడా వ్యవహర్త విద్యా శిక్షణ ననుసరించే ఉంటుంది

విద్యావంతుల భాషలో రాతననుసరించి ఏర్పడే హ్రస్వీకృత సమాసాలుంటాయి 'సోసోరిస' అంటే ఒకప్పుడు సోషలిస్టు సామ్యవాద రిపబ్లిక్కుల సమాఖ్య, 'ఐరాస' అంటే ఐక్యరాజ్యసమితి, కొన్ని అశ్లీల పదాలను ఇట్లా కుదించి మాట్లాడే భాషలో వాడతారు ఈ ప్రక్రియ చదువుకున్నవారిలో ఎక్కువ

ఇట్లాంటి ఎన్నో విభాగాలు, పద్ధతులూ మనఃపదకోశంలో ఉంటాయి. వ్యవహర్తల భాషాజ్ఞానంలోనూ, దక్షతలోనూ ఈ భేదాలు ప్రస్ఫుటమవుతాయి

ఈ మాటలన్నీ వ్యవహర్త ఎట్లా ఉపయోగించుకుంటాడు? ఒక్కో అవసరానికి తగినట్లు మాటలుపయోగించుకోటానికి అరల ఏర్పాట్లున్నాయా?

ఈ ప్రశ్నలన్నిటికీ నిశ్చయార్థక సమాధానాలు దొరకటం కష్టం. మాటల మధ్య వాటి అర్థం మధ్య అసంఖ్యాకమైన లింకులున్నాయి. ఈ లింకులు అన్నీ కానీ, కొన్ని కాని సమాంతరంగా పనిచేస్తుండవచ్చు. పుస్తకంలో పేజీలు తిప్పేలాంటి పరిమితులు మనఃకోశానికుండవు ఒక్కోసారి ఒకే మాటకు పరిమితమయ్యే నిబంధన కూడా మనిషి భాషాయోజనకు లేదు.

ఇంతసేపూ మనం మనిషికున్న భాషావ్యవహార శక్తిలో భాగంగా మనఃపదకోశం గురించి మాట్లాడుకున్నాం.

భాషాపరిశోధకులు మనఃపదకోశం గురించి ఏంచేయాలి?

వ్యవహర్తకున్న భాషాజ్ఞానాన్ని పట్టుకోటమే భాషాపరిశోధన లక్ష్యమైతే - ఇది దాదాపు ఈ నాటి భాషాపరిశోధకులందరూ అంగీకరించిన లక్ష్యమే - వ్యవహర్తకున్న మనఃపదకోశానికి భౌతిక రూపమియ్యటమే భాషాపరిశోధకుల లక్ష్యం.

ఇక్కడ ఒక క్షణం ఆగి భాషాశాస్త్ర పరిశోధన మార్గాన్ని ఒకింత ప్రస్తావిస్తాను అతిప్రాచీనకాలం నుంచి పదాలు, వాటి భేదాలు, వాటి నిష్పాదన వగైరాల గురించి వ్యాకర్తలు ఆలోచిస్తూనే ఉన్నారు. భారతీయ సంప్రదాయంలో పదాలకు వాక్యంలో వాటి ప్రయోగానికి సముచితమైన స్థానం మొదటి నుంచీ ఉంది. యోగ్యతా కాంక్షా సత్తియుతమైన పదసముదాయం వాక్యమని ప్రాచీనులు భావించారు.

పదాలు, వాటి అర్థవంతమైన కూర్పు భాష అనే నా నిర్వచనం దీని మీద ఆధారపడిందే

సంస్కృత వ్యాకరణ సంప్రదాయంలో పదాలకూ వాటి అర్థాలకు, వాటి సంయోజనకు సముచితమైన ప్రాధాన్యం మొదటి నుంచీ ఉంది

ఆధునిక భాషాశాస్త్రంలో పదాలపట్టిక వ్యాకరణంలో భాగంగా సుమారు 1964 నుంచి పరిగణించబడుతూ వచ్చింది చామ్‌స్కీగారి Aspects of the theory of syntax (1965) పుస్తకంలో Lexicon (పదనిధి) అనేది వ్యాకరణంలో భాగంగా ప్రతిపాదితమైంది ధ్వని విభాగం - అర్థ విభాగం రెండూ వ్యాకరణంలో భాగాలుగా పరిగణించటంతో పదవిభాగం వ్యాకరణంలో తప్పనిసరి విభాగం అయింది. ఈ పదకోశంలో పదాలకు విభేదక ధ్వన్యంశాల (Distinctive phonological features) స్వరూపం ఉంటుందనీ, వాటి అర్థాలు, వ్యాకరణాంశాలు కూడా జోడించాలనీ, అవి అన్నీ కలిపి సంకీర్ణ సంకేతాలు (complex symbols)గా ఉంటాయని, వాటిని పదబంధ నిర్మాణ సూచిక (phrase markers)ల్లో పద ప్రవేశ సూత్రాలు (lexical insertion rules) ద్వారా ప్రవేశపెట్టాలని ఛోమ్‌స్కీగారి పరివర్తన వ్యాకరణం నిర్దేశిస్తుంది. ఆ తరవాత 1968 ప్రాంతంలో Remarks on Nominalizations అనే వ్యాసంలో వ్యాకరణంలో పదకోశాన్ని సంపన్నంచేసే ప్రతిపాదనలు చేశారు. మరో పక్క నుంచి Fillmore అనే శాస్త్రజ్ఞుడు 1966 ప్రాంతంలో క్రియలకు నామబంధాలకున్న సంబంధాలను నిరూపిస్తూ కోశంలో క్రియల పాత్రను నిర్వచించాడు ఆయనా, ఆయన సహచరులూ అప్పటి నుంచి ప్రత్యేకంగా కొన్ని రకాల క్రియల ప్రవర్తన గురించి ప్రత్యేకాధ్యయనం చేశారు.

మధురవాణి మాట కచేరి

# రంగాజమ్మ సాక్షిగా...

- సత్తెనపల్లి రామమోహన్‌రావు

అన్ని అందాలు ఆ పెళ్ళికొడుక్కే- అన్నట్లు గిరీశంగారిలో అన్ని లక్షణాలు వున్నాయి ఉపన్యాసాలివ్వటం, చుట్టలు కాలుస్తూ చదువు చెప్పటం, చుట్టలు కాల్చటం కూడా నేర్పటమే కాక ఆయన కవిత్వం కూడా చెప్పగలడు అసలు ఆడవాళ్ళు కనపడితేనే మగవాళ్ళకు కవిత్వం పుట్టుకొస్తుంది. ఇహ గిరీశం లాంటి వాళ్ళ సంగతి గురించి చెప్పనే అక్కర్లేదు అమాయకురాలు బుచ్చెమ్మను చూసినప్పుడే- ''కాముని విరిశరముల బారికినేనేమని సహింతునే చెలియ యేమని సహింతునే-'' అని కవిత్వం మొదలుపెట్టాడు యిహ నాలాంటి వాళ్ళను చూసినప్పుడు ఊరుకుంటాడా? - పూటకూళ్ళమ్మని గురించి ఏమన్నా కవిత్వం చెప్పాడో లేదో తెలియదు కాని కవిత్వాన్ని మించిన మాటలతో ఉబ్బించే వుంటాడు లేకపోతే అడిగినప్పుడల్లా టెన్‌రూపీసు ట్వంటీ రూపీసు యిస్తుండేదా... అవి పట్టుకొచ్చి నాలాంటి వాళ్ళ దోసిట్లో పోసేవాడా? - పూటకూళ్ళమ్మ దగ్గర నుంచి డబ్బు పట్టుకొచ్చి- ''పుల్లుమూను లైటటా, జాసుమిన్ను వైటటా, మూనుకన్న మొల్లకన్న నీదు మోము బ్రైటటా-'' అంటూ నా గురించే కవిత్వం వొలకపోసేవాడు గిరీశం.

ఎంతయినా ఆడది మెచ్చిందే అందం అన్నట్లు ఆడవాళ్ళు రాసిందే అందమైన కవిత్వం అంటాను నేను. ఈ మగ ప్రపంచంలో అంతగా పైకి రాలేకపోయారు కాని- మగవాళ్ళతో దీటుగా కవిత్వం చెప్పిన ఆడవాళ్ళు కూడా ఎందరో వున్నారు శ్రీనాథునిలా కనకాభిషేకం చేయించుకున్న వాళ్ళూ వున్నారు- పెద్దనలా స్వర్ణకంకణాలు తొడిగించుకున్న వాళ్ళూ వున్నారు వెనకతంజావూరులో నా పేరు కలదే- అంటే మధురవాణి అనే ఓ కవయిత్రి వుండేదిట. ఆ రోజులలోనే ఆమె కనకాభిషేకాలు చేయించుకొని, స్వర్ణ కంకణాలు తొడిగించుకొంది. 15వ శతాబ్దంలోనే కవయిత్రులు యిలా విజృంభించి సన్మానాలు చేయించుకొని దండ లేయించుకోటం గొప్పే కాదూ? .. ఆ మాటంటే గిరీశంగారు ఒప్పుకోడు. ఆయనకెంత సేపు తన గురించి గొప్పలు చెప్పుకోటమే కాని, యితరుల గొప్పలు గుర్తించటమన్నదే లేదు కదా?

పానకంలో పుడకలా యిప్పుడు గిరీశం సంగతి ఎందుకు కాని కవులు ఆడవాళ్ళ అందచందాలను వర్ణించినట్లే కవయిత్రులు నాయకుల అందాలను, ఠీవిని అరమరికలు లేకుండా వర్ణించేవారు. ''ఇప్పటి నవలా రాణులు ఆరడుగుల అందగాళ్ళను గురించి వర్ణించటం లేదా అలాగే అదీను-'' అంటుంది రాంభొట్లు గారి అచ్చమ్మ. నవల వుంటే చాలు ఆమెకు పులుసటుకులు కూడా అక్కర్లేదు. అన్ని నవలలు చదవబట్టే ఆమె కంటికి గిరీశం ఓ నవలా నాయకుడిలా కనిపిస్తాడు ''మీరొప్పుకుంటే మిమ్మల్ని పెళ్ళాడతాను-'' అని గిరీశానికి బుచ్చెమ్మ ద్వారా కబురు కూడా పంపుతుంది ఆమె అదృష్టమూ బుచ్చెమ్మ దురదృష్టమూ వల్ల గిరీశం ఒప్పుకోలేదు కాని- లేకపోతే ఆమె జీవితమే ఒక విషాదాంత నవల అయిపోయేది. నవలల సంగతి అలా వుంచితే వెనకటి కావ్యాలలో కవయిత్రులు రాజులనే తమ కథలకు హీరోలుగా చేసి వర్ణనలతో ముంచెత్తేవారు. అలా వర్ణించటంలో రంగాజమ్మ అనే కవయిత్రి అందర్నీ మించిపోయింది ''సారభుజా బలంబునను, జక్కదనంబున, సద్గుణంబులన్ ధీరమతి ప్రతాపముల దిక్కుల మిక్కిలి నిండు కీర్తులన్-'' నీకు సరిమరొకరు లేరంటూ ఎడాపెడా పొగిడేసి, విజయరాఘవ నాయకుని ఆస్థానంలోనే కాక ఆయన హృదయంలో కూడా స్థానాన్ని సంపాదించుకొందా కవయిత్రి.

త్యాగరాజు గారింట్లో దోమలు కూడా సంగీతం పాడతాయన్నట్లు రంగాజమ్మ యింట్లో వుండే చెలికత్తెలు కూడా చమత్కార పద్యాలే చెప్పేవారు. ఓ సారి రాజుగారు రంగాజమ్మ యింటికి వెళ్ళి పట్టెమంచం మీద కూర్చున్నాడుట. ఆ అవకాశాన్ని అనువుగా తీసుకొని ఓ చెలికత్తె- ''ఇంతీ పానుపుపై నిదె కంతుడు

కూర్చున్నవాడు కనుగొను మహహా-'' అంది మంచం మీది మన్మధుడు అంటే అటు రాజుగారు యిటు నేస్తురాలు రంగాజమ్మా యిద్దరూ సంతోషిస్తారని ఆ అమాయకురాలు అనుకుందేమో తెలియదుకాని- రంగాజమ్మకు మాత్రం యీ వరస నచ్చలేదు- ''కంతుడనంగుడు నీ తెలివింతేనా విజయరాఘవేంద్రుడె చెలియా-'' అంటూ నెచ్చెలి పొగడ్తను పూర్వపక్షం చేసేసింది శరీరమే లేని మన్మథుడితో పోలుస్తావేమిటి- అంతకు మించిన అందాల నిధి అని రంగాజమ్మ వర్ణించటం ఆ రాజుగారిలో పులకింతలు పుట్టించి వుండకపోదు.

ఇన్ని మతలబులు లేకుండా సూటిగా చెప్పేదే కవిత్వం అనుకుంటే- అలా సూటిగా చెప్పటంలో కూడా రంగాజమ్మ ఘటికురాలే. ఆ మాటకొస్తే ఏ మెలికలూ లేకుండా సూటిగా మాట్లాడడంలోను ప్రవర్తించడంలోను పూటకూళ్ళమ్మ కూడా ఘటికురాలే. అందుకే గిరీశాన్ని వెదుకుతూ వల్లెవాటులో చీపురుకట్ట దాచి సరాసరి నా యింటికే వచ్చిందోసారి. ''ఎక్కడా ఆ వెధవెక్కడా-'' అంటూ సూటిగా అడిగేసింది. తర్వాత ''మంచంకింద దాగాడేమో-'' అంటూ మంచం కింద దూరి రావప్ప పంతుల్ని చీపురుగట్ట తిరగేసి కొట్టింది. నన్నెందుకు కొడతావు అంటే- మరి మంచంకిందెందుకు దూరావు- అని సరసంగానే అయినా సూటిగా అడుగుతుంది. నీకెందుకా గోష అదో సరసం- అని రావప్ప పంతులు అంటే- ఇదో చీపురుకట్ట సరసం- అని టక్కున జవాబు చెబుతుంది ఇంత చమత్కారం తెలిసిన పూటకూళ్ళమ్మే కనక గరిట బదులు కలం పట్టుకొని వుంటే వాస్తవిక సాహిత్యం బండ్లకొద్దీ వచ్చి వుండేది తెలుగు సాహిత్యాని కా అదృష్టం లేకపోయింది. ఆ లోటు ఇతరుల వల్ల తీరిందనుకోండి అది వేరే సంగతి.

మామూలు మాటలలో అప్పటి సంఘ పరిస్థితుల్ని తెలియచేయటంలో కూడా రంగాజమ్మ గొప్ప చాతుర్యాన్నే కనపరిచింది తను రాసిన ''మన్నారుదాస విలాసం'' అనే యక్షగానంలో అప్పటి విద్వాంసుల వివాదాలు, ముత్తైదువల ముది మాటలు, పురోహితుల డాంభికాలు వున్నవి వున్నట్లు వర్ణించటమే కాక- నవ్వు పుట్టించేటట్లుగా కూడా రాసింది

ఒక పండితుడు మరొకర్ని యేమోయి అన్నాట్ట. ఆ పిలుపుకు అవతలి పండితుడికి ఆగ్రహం కట్టలు తెంచుకొంది. ''వోరీ... నిన్నటి సుడుపడవు నా వంటి యోగ్యుణ్ణి జూచి యేమి వదరేవురా శునకంవలె. పాదరక్షలు తీసి రెండు ప్రహరింతునో-'' అంటూ విరుచుకు పడతాడు. అవతలా యన కేం భాష రాదా, మాటలు తెలియవా తిట్లకు తక్కువా- అందుకే - ''వోరి వృద్ధ గార్దభమా! నోరు గలదంచున్న నెత్తినోరు బెట్టుక కూయ వచ్చినాండవు. కపోల తాడనము సేతునో-'' అంటాడు. తర్వాతా యిద్దరూ త్వమేవగార్దభః- అంటే- త్వమేవ శునకః త్వమేవ సూకరః- అంటూ ఎక్కడెక్కడి తిట్లూ జ్ఞాపకం తెచ్చుకొని సన్నివేశాన్ని రక్తికట్టిస్తారు. పాఠకులను, ప్రేక్షకులను కడుపుబ్బా నవ్విస్తారు. రంగాజమ్మ శృంగార కవయిత్రే కాక హాస్యం, వ్యంగ్యం వొలికించటంలో కూడా దిట్టే అనిపించుకొంది- యీ ప్రబంధం రాసి

అగ్రహారపు ఆడవాళ్ళని చూసిన తర్వాత అప్పుడప్పుడూ నాకు- ''కులకాంత లేయూరు వలపులే యూరు-'' అని అనాలనిపిస్తూ వుండేది. ఆ మాట రంగాజమ్మ ఎప్పుడో అనేసింది. అందుకే కాపీ కొట్టటం యిష్టం లేక నేనా మాట పైకి అనలేదు- లోపలనుకున్నా. కాని, రంగాజమ్మ మాత్రం ఎటువంటి మొహమాటాలకూ పోకుండా అలాంటి మాటలన్నిటినీ పైకే అనేసింది. ఈ చమత్కారితోనే విజయరాఘవ నాయకుడు పొద్దంతా గడపటం ఆయన పట్టమహిషి కాంతిమతికి నచ్చలేదు. ఆమె ఓ రోజు రంగాజమ్మను తిడుతూ మాట్లాడిందట. అందుకు రంగాజమ్మకు కోపం వచ్చినా అందరి ఆడవాళ్ళకు మల్లే నోరు చేసుకొని తనూ తిట్టిపొయ్యలేదు. ఓ చక్కని పద్యాన్ని రాసి రాజుగారి పట్టపురాణికి పంపింది. ''ఏ వనితల్ మముం దలప నేమి పనో తమరాడువారు గారో, వలపించనేర్పరుగరో-'' అంటూ ప్రశ్నల వర్షం కురిపించి- ''తమ కౌగిటిలో నుండగా రావది యేమిరా విజయరాఘవ యం చిలు దూరి బల్మిచే దీవరకత్తెనై బెనగి తీసుకువచ్చితినా తలోదరీ''- అంటూ సూటిగా అడుగుతుంది. నీ మందిరంలోకి వచ్చి నీ పడకగదిలో

దూరి నీ కౌగిలిలో వున్న నాయకుణ్ణి బలవంతం చేసి తీసుకుపోయానా భామామణీ అని అంత సూటిగా అడుగుతుంటే ఆ ఇల్లాలు ఏం జవాబు చెప్పగలుగుతుంది. అందుకే కులకాంతలే యూరు వలపులే యూరు అన్నాను అని అన్నా అంటుంది కదూ ఆ చమత్కారి రంగాజమ్మ.

ఆ సంగతి ఎలా వున్నా చమత్కారమే యూరు చానలే యూరు- అనే బుద్ధిమంతులు కొందరున్నారు. అలాంటి వాళ్ళకు చక్కని జవాబు రంగాజమ్మ రాసిన చమత్కార సంభాషణలూ పద్యాలే. ''నీ చమత్కారం నా దగ్గర కాదు-'' అని ఓ సారి పూటకూళ్ళమ్మి అందికాని ఆవిడ నా చమత్కారాన్ని, కళ్ళ భాషను బాగానే అర్థం చేసుకొంది. అందుకే చప్పున మంచం కిందికి దూరి రావప్పపంతులు దుమ్ము దులిపేసింది. ఇవన్నీ తెలిసిందాన్ని కాబట్టే చమత్కారమే యూరు చానలే యూరు- అంటేనేనొప్పుకోను. చమత్కారంగా మాటలు చెప్పటంలోకాని, చతురోక్తులతో కూడిన కవిత్వం చెప్పటంలో కాని చమత్కారంగా ప్రవర్తించటంలో కాని ఆడవాళ్ళు- మగవాళ్ళకేమీ తీసిపోరని ఒక ఆకు ఎక్కువేనని రంగాజమ్మ సాక్షిగా- గడకట్టి భేరికా డాండ డడాండ డాండ నినదంబు ల జాండము నిండ మత్తవేదండము నెక్కి చాటనే! ...

## ఏప్రియల్ నెల 'మెదడుకు మేత' సమాధానములు:

1 ఒక కవి మరొక కవికి అంకితము గావించిన మొదటి కావ్యము ''దశకుమార చరిత్రము'' (ఆంధ్రము)

2 ''శివతత్త్వసారము''ను రచించినది మల్లికార్జున పండితారాధ్యుడు (1120-1180) ఇతడు పెక్కు గ్రంథములు రచించినట్లు తెలియుచున్నను, అందు లభ్యమగుచున్న గ్రంథము శివతత్త్వ సారమొక్కటే ఇందు శివా, రుద్రా, మహేశా అను సంబోధనలతో కూడిన కంద పద్యములు నాల్గువందలకు పైగా కలవు. శత సంఖ్యా నియమమును, సమాన మకుట నియమమును లేకున్నను

3 సంకుసాల నృసింహకవి ఈయన ''కవికర్ణ రసాయనము''ను మాంధాత చరిత్రమును రచించెను ఈ కావ్యమును గురించే ఆయన పైవిధముగా నుడివెను

4 అనంతా మాత్యుడు భోజరాజీయమేగాక ఛందో దర్పణము, రసాభరణము అను గ్రంథములను ఈయన రచించెను

5 ''సుమతీ శతకము''ను బద్దె భూపాలుడు రచించెను 'నీతిసారముక్తావళి' వీరి ఇతర రచన

6 ''త్రిపురాంతకోదాహరణము'' తెలుగునందలి ఉదాహరణ కావ్యములన్నిటిలో ఉత్తమమైనది దీనిని త్రిపురాంతకుడను కవి రచించెను

7 గోన బుద్ధారెడ్డి (1200-1250) తన తండ్రి విట్ఠల లక్ష్మీనాధుని పేర రంగనాధ రామాయణమును రచించెను. దీనికి రంగనాధ రామాయణమని పేరుండుటచే రంగనాధుడను కవి దీనిని రచించి బుద్ధారెడ్డి పేర ప్రకటించెనను ప్రవాదము కలదు కాచవిభుడు, విట్ఠలుడను బుద్ధారెడ్డి కుమారులు తరువాత ఉత్తర కాండము రచించి దీనిని పూర్తిచేసిరి.

8 సంస్కృతమున ప్రబంధ శబ్దము కావ్య సామాన్య వాచకము ప్రకృష్టమైన (శ్రేష్ఠమైన) బంధముగల ఏ కావ్యమునైనను ప్రబంధమని చెప్పవచ్చును ప్రఖ్యాత వస్తుకము, ధీరోదాత్తనాయకము, శృంగార రసప్రధానము, అష్టాదశ వర్ణనా భూయిష్టము, ఆలంకారిక శైలీ శోభితమునై అయిదారు ఆశ్వాసములతో కూడిన కావ్యమునకు తరువాత ప్రబంధమను నామము రూఢమైనది

9 నంది మల్లయ, ఘంటసింగనలు ఆంధ్ర సాహిత్యమున మొట్టమొదటి జంటకవులు వీరు వేదాంత బోధకమైన సంస్కృత 'ప్రబోధ చంద్రోదయ నాటకము'ను ప్రబంధ రూపమున అనువదించుటేగాక 'వరాహపురాణము'ను కూడా ఆంధ్రీకరించిరి వీరిలో ఘంటసింగన (అష్టదిగ్గజాలలోని) నందితిమ్మన కు మేనమామ ఘంటసింగనకు 'మలయ మారుతకవి' అను బిరుదము కలదు.

10. తెనాలి రామకృష్ణకవి. ఈయన పాండురంగ మాహాత్మ్యము, ఉద్భటారాధ్య చరిత్రము, ఘటికాచల మాహాత్మ్యము మొదలగు గ్రంథములను రచించెను. ఇతడు కథా కథనమందును, రసపాత్ర పోషణయందును, ప్రౌఢమైనశైలియందును, అసాధారణమైన నైపుణ్యము ప్రదర్శించెను. హాస్యపూరితములైన ఇతని చాటువులు సర్వాంధ్ర దేశ ప్రసిద్ధములు.

# తూర్పు పడమరల కలగలుపు

–'మిసిమి' రచనల వర్క్‌షాప్

దిక్కులు కలుసుకొనకపోవచ్చును గానీ, మనుషుల అభిప్రాయాలు, ఆలోచనలు ఏదో ఒకసందర్భంలో అంతో ఇంతో ఒకేలా వుంటాయి. మనిషి పుట్టుకతో పాటే పరిశోధన ప్రారంభమైందంటే ఆశ్చర్యపడవలసిన పనిలేదు. ఆ పరిశోధనలోనే మనిషి నిరంతరం తన చుట్టూ ఉన్న పరిసరాల్ని తన కనువుగా మార్చుకోసాగాడు. ఈ పరిణామం అంతం లేనిది, మనిషికి ఆలోచనలు రావడం మాననంతవరకు. అయితే ఏదో ఒక 'సమస్య' అనేది లేకపోతే కొత్త మార్పును మనం సాధించలేమన్నది కూడా నిజం!

ప్రస్తుతం తూర్పు పడమరల అభివృద్ధి కానీ, అభిప్రాయాలు కానీ ఒకేలా ఉన్నాయా ? అంటే- ఊహుఁ! అని సమాధానమియ్యవలసి వుంటుంది. ఎందుకంటే పశ్చిమదేశాలు అభివృద్ధి కర విలువలపై ఆధారపడి పురోగమిస్తున్నాయి. విభిన్న సాంస్కృతిక విలువలతో సతమతమవుతూ అభివృద్ధికై ఘర్షణ పడుతూవున్న దేశాలు తూర్పుదిశన ఉన్నాయి. తూర్పు దేశాలు నూతన సమాజాలుగా అవతరిస్తాయా ? లేక ఓటమితో రూపుమాసిపోతాయా ?

చరిత్రలో ఇంతవరకూ జరగని విధంగా తూర్పుపడమర దేశాలు అతివేగంగా ఒక దానికొకటి దగ్గరవుతున్నాయి. ఇలా జరగడం ఈనాడు కొత్తకాక పోయినప్పటికీ, గతంలో లేని వేగం ప్రస్తుతం మనకు కనిపిస్తుంది సాంకేతిక విప్లవం, విస్తరిస్తున్న విజ్ఞాన పరిశోధనలు, ఎలక్ట్రానిక్ రహదారి తూర్పు పడమరల మధ్య ఉన్న దూరాన్ని (భౌగోళికంగా కాదు) తగ్గిస్తున్నాయి. ఉదాహరణకు ఎక్కడో వేలమైళ్ళ దూరంలో విదేశాలలో జరుగుతున్న టెన్నిస్ పోటీలను మారుమూల పల్లెలో మన ఇంట్లో కూచుని చూడగలుగుతున్నాం. అలాగే మన దేశంలో జరిగే విశేషాలను విదేశీయులు దర్శించగలుగుతున్నారు. ఈ వేగంలోని నేపధ్యాన్ని గమనించినట్లయితే మూడు ముఖ్యాంశాలు మనకు అవగతమవుతాయి.

మొదటిది, కలయిక అనివార్యమనేది. 15వ శతాబ్దం వరకు, మనం రెండు, విభిన్న ప్రపంచాల్లో నివసించి వున్నాం. రెండు విభిన్న ప్రపంచాలు వుండడమే కాదు. ఎన్నో విశిష్టమైన గుర్తింపులు ప్రపంచంలో విస్తరించి వుండేవి. అయితే, పెట్టుబడిదారీ విధానం పుట్టి పెరిగేకొద్దీ విభిన్న సమాజాలు, తిరుగులేని విధంగా ఐక్యతా మార్గంలోకి ప్రవేశించాయి.

మనం, మన సాంస్కృతిక, భాషా ప్రత్యేక లక్షణాలను యింకా కొనసాగిస్తున్నాం. అయితే, మన ఆర్థిక వ్యవస్థలు మాత్రం అతివేగంగా తారుమారౌతు వున్నాయి. సమాజాల్లోని వర్గవైరుధ్యాలు, వివిధ స్థాయిల్లో కొనసాగుతున్న ఆర్థికాభివృద్ధి, కొంత వరకు పెట్టుబడిదారీ విధానాన్ని వికృతపరచి, దాని ప్రవేశాన్ని అడ్డుకోవచ్చు. ఏమైనా, యీనాడు పెట్టుబడిదారీ విధానం ఒక్కటే ఆధునికాభివృద్ధికి మార్గదర్శిగా నిలబడింది.

రెండవ వాదన - పెట్టుబడిదారీ విధానం, (దాన్నే మార్కెట్ శక్తులు అనికూడా అంటారు) చరిత్రలో పురోగమన పంథా (పర్యావరణ వాదులు తిరోగమనమని అంటారు) తన వేగాన్ని పెంచుకుంది దానికి తిరుగులేదు. ఎందుకంటె, పెట్టుబడిదారీ విధానానికి, మార్కెట్ శక్తులు యింజను లాంటివి. ప్రచార సాధనాలు శకటం లాంటివి. ప్రచార సాధనాలు ఎంతో వేగంగా విస్తరిస్తున్నాయి. వాటిని ఆపేశక్తి ఎవరికీ లేదు. కొన్ని శతాబ్దాల ముందు వాటి ఉనికిగాని, నడకగాని గుర్తింపు పొంద లేదు. కాని 20వ శతాబ్దం రెండో భాగంలో కంప్యూటర్లు, సాటిలైట్ సాంకేతిక పరిజ్ఞానం అందుబాటులోకి వచ్చిన తర్వాత ప్రచార సాధనాల వాడి, వేగం గతంలో లేని విధంగా పరిధులను దాటిపోయాయి.

సంఘంలో పరిమాణాత్మక మార్పు, గుణాత్మక మార్పును సృష్టిస్తుందనేది సత్యం. మన కాలంలో యీ మధ్య ప్రచార, వార్తా సాధనాల స్వరూప, స్వభావాల్లో అతిశీఘ్రంగా వచ్చిన అభివృద్ధి సాటిలేనిది అలాగే ప్రపంచంలోని సాంఘిక, ఆర్థిక వ్యవస్థల్లో విస్తరించిన పెట్టుబడిదారీ విధాన ప్రభావం మనం యిదివరకు ఎప్పుడూ కనీవినీ ఎరుగము. ఉదాహరణకు, వ్యవసాయ విప్లవాన్నే తీసుకోండి. ప్రపంచంలోని దేశాలన్నింటిలో సాంఘిక ఆర్థికపరంగా, వ్యవసాయ రంగంలో ఒకే తరహా పద్ధతులు వచ్చేందుకు కొన్నివేల సంవత్సరాలు పట్టింది. కాని ఆధునిక కాలంలో వ్యవసాయ శాస్త్రవిజ్ఞానం శీఘ్రంగా అన్ని దేశాలకు విస్తరించింది. అలాగే మార్కెట్ శక్తుల ప్రభావం నాలుగు లేక ఐదువందల సంవత్సరాల కాలంలో జరిగినమార్పు కంటే గత 50 సంవత్సరాల కాలంలో జరిగిన అభివృద్ధిని గమనిస్తే, వచ్చే 25 సంవత్సరాల్లో పెట్టుబడిదారీ విధానం ప్రపంచంలోని మారుమూల ప్రాంతాల్లోకి కూడా దూసుకొని వెళ్తుందనీ, ఎప్పుడూలేని విధంగా మానవజాతిని ఏకం చేస్తుందనే విషయం బోధపడుతుంది.

ఇక మూడవ వాదన - మన వద్దనున్న సాక్ష్యాధారాలను బట్టి, మార్కెట్ శక్తులు అభివృద్ధి చెందేందుకు ప్రత్యేకమైన, నైతిక సూత్రాలుగాని, విలువలుగాని అవసరం లేదని చెప్పడం సరికాదు. ఐరోపాలో తొలిరోజుల్లో, ఫ్లారెన్స్, వెనిస్‌లోని యూదులు, ఇటాలియన్ల బ్యాంకుల వల్లనే ప్రొటెస్టెంట్‌నైతిక సూత్రాల ప్రేరణతో పెట్టుబడిదారీ విధానాన్ని అవగాహనచేసుకున్నారని కొందరు మేధావులు పేర్కొన్నారు. ఇప్పుడు తూర్పు ఆసియాలోని జపాన్‌అద్భుత విజయాలు సాధించడంతో అక్కడ పెట్టుబడిదారీ విధానానికి ప్రత్యేక నైతిక విలువలు లేవని చెప్పలేము. మార్కెట్ విలువలు ఎక్కడ వేళ్లూనినా, అక్కడ వాటి ప్రభావం ఇట్టేకనిపిస్తుంది విద్య, మంచి ప్రజాపరిపాలన లాంటి వాటిని అభివృద్ధి చేసే సామర్థ్యాన్నిబట్టి నవీన సమాజాల్లో పెట్టుబడిదారీ విధానం జయప్రదమౌతుంది.

గతంలో వెయ్యి సంవత్సరాలు సాంఘికార్థిక అభివృద్ధి పద్ధతితో, గత ఐదు శతాబ్దాల పద్ధతిని పోల్చి చూసినట్లయితే, మార్కెట్ శక్తులు తిరుగులేని విధంగా ముందుకు పోతాయనే సత్యం మనకర్థమౌతుంది 18వ శతాబ్దంలో ఆడమ్‌స్మిత్, 19వ శతాబ్దంలో కార్ల్ మార్క్స్ యీ ధోరణిని గమనించి వారి అభిప్రాయాలను గ్రంథస్థం చేశారు. మార్క్స్ గొప్ప రచనలైన కమ్యూనిస్ట్ మానిఫెస్టో, దాస్ కాపిటల్, తర్వాత బయటపడ్డ రాత ప్రతులు - యీ నూతనపరిమాణాలపై మార్క్స్ యొక్క ఆశ్చర్యాన్ని, ఆవేదనను వ్యక్తం చేశాయి. పెట్టుబడిదారీ విధానాన్ని ఒక భయంకరమైన రాక్షసిగా ఆయన చూశాడు. మార్కెట్ శక్తులు, అద్భుతమైన సృజనాత్మక శక్తి అనీ, దాన్ని వేగంగా లొంగతీసుకోకుంటే, మన నాగరికతనే స్వాహా చేస్తుందని ఆయనగమనించాడు. పెట్టుబడిదారీ విధానానికి విరుగుడుగా ఆయన ''శాస్త్రీయ సోషలిజం'' ను ప్రతిపాదించాడు భూస్వామ్య, పెట్టుబడిదారీ విధానాలు రెండింటికీ మానవత్వంతో కూడిన సోషలిజమే ప్రత్యామ్నాయం అని ఆయన పేర్కొన్నాడు. మార్క్స్ గతాన్ని సరిగ్గానే చదవగలిగాడు. కాని భవిష్యత్తును గురించిన ఆయన జోస్యం సరియైంది కాదని తేలిపోయింది. పెట్టుబడిదారీ విధానం, స్వయం సర్దుబాట్ల బాటలో గతితర్కంగా ముందుకు పోయింది తప్ప మార్క్స్, ఆయన శిష్యులు చెప్పినట్లుగా పెట్టుబడిదారీ విధానం నాశనం కాలేదు. మానవత్వ విలువలతో అది అభివృద్ధి దిశగా సాగిపోతూ వుందని నేడు మనం చూస్తున్నాము.

ప్రస్తుత కాలాన్ని గమనిస్తే, పెట్టుబడిదారీ విధానానికి ప్రతిగా వున్న సోవియట్‌యూనియన్ ప్రయోగం 1989లో కుప్పకూలిపోయింది. ప్రాక్ పశ్చిమ పెద్దదేశాలు, మార్కెట్ శక్తుల విధానంలో తమ ఆర్థిక పద్ధతులను మలచుకోటానికి పోటీపడుతున్నాయి అభివృద్ధి చెందుతూవున్న దేశాల్లో యింకా పురాతన సాంప్రదాయాలుగల సమాజాలు ఎన్నోవున్నాయి. అవన్నీ, పెట్టుబడిదారీ విధానానికి ముందుగావున్న, సాంఘిక, ఆర్థికవిధానాలనే కొనసాగిస్తూ వున్నాయి అయితేఫలప్రదంకాని పోరాటాలు సలుపుతూ వున్నాయి. ఆసియాలో మార్కెట్ శక్తులతో సర్దుబాటు చేసుకొనేందుకు ముమ్మరంగా పోరాటాలు సాగుతున్నాయి. పెట్టుబడిదారీ ఆధునీకరణ మార్గంలో ప్రయాణించిన దేశం, ఆసియాలో జపాన్‌మొట్టమొదటిది. 19వ శతాబ్దంలో నిదానంగా మొదలెట్టి, ప్రపంచ యుద్ధం తర్వాత 1950-73కాలంలో వేగాన్ని పెంచుకుంది. ఆ

కారణంగా, ఉత్తర అమెరికా, ఐరోపాదేశాలు నిర్వహించే"WEST" అనేక్లబ్బులో దానికిసభ్యత్వం లభించింది అది ఎంతో గౌరవప్రదమైనదిగా భావించబడింది మార్కెట్ ఆర్థిక పద్ధతుల మార్గం, కేవలం పశ్చిమదేశా ప్రత్యేక హక్కు కాదని, ప్రత్యేక నైతిక విలువలతో కూడి వుందని, జపాన్ నిరూపించింది. ఆసియాలోని మిగత దేశాలు యిప్పుడు ఆ బాటనే అనుసరిస్తున్నాయి. అయితే, జపానంత వేగంగా అవి పోతాయో లేదో వేచి చూడవలసి వుంది. కాని వాటి మార్గం గురించి ఏమాత్రం సందేహం లేదు.

**పెట్టుబడిదారీ విధానానికి సాంకేతిక వేగం, సామర్థ్యం కీలకాంశాలు.** ఆసియాలోనూ, అమెరికాలోని అనేక ప్రాంతాల్లోనూ, పురాతన సాంప్రదాయ సమాజాలు కొనసాగుతున్నప్పటికీ, ఆధునీకరణ, యిదివరకటి కంటె యిప్పుడు ఎక్కువ వేగంగా జరుగుతూవుంది. ఐరోపాలో ఆధునీకరణ కార్యక్రమం శతాబ్దాలపాటు జరిగి, ప్రజావిప్లవాలకు కారణభూతమైంది. ఇప్పుడు ఆమార్పు కొన్ని దశాబ్దాల్లోనే జరిగిపోతూ వుంది. ఇప్పుడు అధిక భాగంలో, ఇండియా, చైనాలతో సహా ఆధునీకరణ కార్యక్రమాలు ముమ్మరమయ్యాయి. వచ్చే 20 సంవత్సరాల కాలంలో అవి ఏ మార్గంలో ముగిసిపోతాయో యిప్పుడే చెప్పలేము. అయితే వేగాన్ని బట్టి, సరితూగే సామర్థ్యాలను, అవి సృష్టించుకోవలసి వుంది అలా కాకుంటే నాడు శతాబ్దాలపాటు ఐరోపాలోనూ, నేడు తూర్పు ఐరోపాలోనూ ఏర్పడ్డ సాంఘిక, రాజకీయ ఉపద్రవాలను అవి ఎదుర్కోవలసి వుంటుంది.

**ప్రసార సాధనాల్లో జరిగిన విప్లవాత్మక మార్పుల కారణంగా వార్తలు అతివేగంగా దిశదిశాంతరాలకు కొద్ది నిమిషాల్లోనే వ్యాపిస్తూ వున్న తరుణం యిది. దీన్ని ప్రచార సాధనాల్లో వచ్చిన మూడవ విప్లవంగా వర్ణించారు.** మొదటిది - ఈజిప్టులో మొట్టమొదటి లిపిని కనిపెట్టడం. రెండవది 15 వ శతాబ్దంలో గుటెన్‌బర్గ్ అచ్చుయంత్రాన్ని కనిపెట్టడం గుటెన్‌బర్గ్ బైబిల్‌ను అచ్చువేయడంవల్ల అది ఎక్కువ ప్రజలకు అందుబాటులోకి వచ్చింది. అంతేకాదు ప్రజాప్రచార సాధనంగా మార్కెట్ శక్తులు విస్తరించేందుకు విప్లవాత్మకంగా పనిచేసింది మూడవ విప్లవం మనం యిప్పుడు చూస్తున్నాం. నాగరికతమీదనే అత్యంత ప్రభావాన్ని చూపుతూవుంది. వార్తా పత్రికలు, రేడియో, టెలివిజన్, రవాణా, కంప్యూటర్లు, ఫ్యాక్స్‌మెషన్లు అతివేగంగా ప్రపంచ వ్యాప్తంగా ప్రసారాలను వ్యాపింపచేస్తున్నాయి సాంప్రదాయ సమాజాల వాకిటి ముందుకు నూతన అభివృద్ధి సాధనాలను తెచ్చి, మార్కెట్ శక్తుల ఆర్థిక విధానాలు వారి అందుబాటులోకి తెచ్చాయి మరోప్రక్క, మార్కెట్ శక్తులు పనిచేసే సమాజాల్లో ఎనలేని సాంఘిక, ఆర్థిక వొత్తిళ్లను సృష్టించాయి.

'పశ్చిమ విలువలు', 'ప్రాక్‌విలువలు' అంటూ ప్రపంచ వ్యాప్తంగా చర్చ జరగడం యాదృచ్ఛికంగాదు. ప్రపంచంపై పెత్తనాన్ని ఆసియా సంపాదించడం అంత సులభసాధ్యం కాదని కొందరు వాదిస్తారు. సాంస్కృతికపరమైన సంఘర్షణలో ప్రపంచం అస్తవ్యస్తమౌతుందని మరి కొందరు చెప్తారు. శతాబ్దాల పర్యంతం వున్న కుటుంబ వ్యవస్థపైన జీవిత విలువలపైన, పురాతన సాంప్రదాయ ఆర్థిక, రాజకీయ విధానాలపైన 'ఆధునీకరణ' భయోత్పాతాన్ని సృష్టించిందనేది వాస్తవమైనా, ఆసియా అత్యున్నత నైతిక విలువల వల్ల 'శీఘ్రగతి'న అభివృద్ధి సాధ్యమౌతుందని కొందరు భావించారు ఇదే సమయంలో 'పశ్చిమ' దేశాల్లో ఆతురత, భయం చోటుచేసుకున్నాయి ''వారు ఎలా చేయగలుగుతున్నారు! నైతిక విలువలతో నిమిత్తం లేకుండా వారు ఆధునీకరణ చేయడం సాధ్యమా? ప్రపంచాధిపత్యం కోసం ఏమి జరుగుతుంది?'' అనేవే ''తూర్పు'' దేశాలపై 'పశ్చిమ' దేశాల భయాందోళనకు కారణం దానికి 'తూర్పు' దేశాలు ఇచ్చేది ''మాకు తెలియదు'' అనే వుదాసీన సమాధానమే ప్రస్తుతానికి మనం గమనించేదేమిటంటే, ప్రసార సాధనాలు అత్యధిక పురాతన సాంప్రదాయ భావాలను పోగొట్టి అవ్యవస్థమైన జ్ఞానాన్ని కలిగించాయి

ఇలాంటి అవ్యవస్థ నుండి వెనక్కిపోయే సమస్య లేకపోవచ్చు ఆసియాలో ఎక్కువ దేశాలు విజ్ఞానంలో క్లిష్ట పరిస్థితులను అధిగమించాయి. టెలివిజన్‌లు, పట్టణాల్లోనూ, నగరాల్లోనూ వెల్లివిరిశాయి. వార్తా పత్రికల ఆదాయం పెరిగింది. ప్రకటనల ఆదాయం ఎక్కువైంది ఆసియాలో మురికి వాడల్లో కూడా టెలివిజన్ ప్రత్యక్షమయింది. టెలిఫోన్ల వాడుక విపరీతంగా పెరిగింది.

నూతన ప్రసారాల ద్వారా, పెట్టుబడిదారీ విధానం, వెనుకబడిన దేశాల్లోకి ఎంతవేగంగా ప్రచారణమౌతుందో తెలుసుకోటానికి ఒక వుదాహరణ - ఈ మధ్య ఇండియాలో వ్యాపించిన ప్లేగు వుదంతాన్ని తీసుకుందాం. సూరత్‌లో వ్యాపించిన యీ వ్యాధి ప్రపంచమంతటా భయాన్ని కలిగించింది. దానికి దేశ విదేశీ ప్రచార సాధనాలు సాయపడ్డాయి. అవి పోటీలు పడి మరీ ప్రచారం చేశాయి. ప్లేగు రావడం నిజమే అది సహజంగానే ఆందోళన కలిగించింది. అయితే, మలేరియా, కలరా మాదిరి వ్యాధులతో భారతదేశంలో చనిపోయినంతమంది, ప్లేగువల్ల చనిపోలేదు. అయినా విదేశీ ప్రచారం తీవ్రంగా జరిగింది. 1994 సెప్టెంబర్ రెండవ భాగంలో సూరత్‌లో ప్లేగు వ్యాపించింది. వేల సంఖ్యలో పట్టణాన్ని వదలి పారిపోయారు. కొందరు తమతోపాటు ఆ వ్యాధిని తీసికెళ్లారు. వెంటనే ఆవార్తను దేశవిదేశాల్లోని వార్తాపత్రికల్లో ప్రచురించారు. టెలివిజన్లలో ప్రధానకాల బులెటిన్లలో చూపించారు. ఇంకేముంది, గల్ఫ్‌దేశాలు, సౌదీ అరేబియా భారతదేశ విమానాలను తమ దేశానికి రానివ్వలేదు. తమ విమానాలు భారత దేశానికి వెళ్లనివ్వలేదు. ఇండియా పేరు వింటూనే విదేశాల్లో ప్రజలు ముక్కుకు చేతిగుడ్డ పెట్టుకున్నారు. అమెరికావెళ్లే ఒక డెల్టా ఏర్‌లైన్స్ విమానంలో ఒక ప్రయాణీకుడు ప్రయాణం పడక వాంతి చేసుకున్నాడు. అందులోని ప్రయాణీకులు భయపడిపోయారు. దాన్నిB.B.C , CNN టెలివిజన్లు ప్రచారం చేశాయి. మనదేశ ప్రభుత్వం దిగ్భ్రాంతి చెందింది. మదర్ థెరిసాను కూడా రోమ్‌లోని విమానాశ్రయంలో వైద్యపరీక్షచేశారు.

బొంబాయిలో స్టాక్ మార్కెట్ మూడురోజులపాటు దిగబడిపోయింది. ప్రతిరోజు, ఉదయం, సాయంత్రం, ప్రతి గంటకు ఒకసారి B B C., CNN ప్లేగు వార్తల ప్రసారంతో దేశవిదేశాల్లోని ప్రజలు బెంబేలెత్తిపోయారు. అలాంటి భయాందోళన యింకా కొనసాగి వుంటే, స్టాక్ సూచిక యింకా పడిపోయి వుండేది. అదేవిధంగా అంతర్జాతీయ పెట్టుబడిదార్లు, తమ పెట్టుబడులను దేశ మార్కెట్లనుండి వెనక్కి తరలించుకొని పోయేవారు కోట్లాది విదేశీమారక నిల్వలు త్వరలోనే కరిగిపోయేవి. 1991 ముందు నాటి సంక్షోభం దేశాన్ని ముంచి వుండేది.

ప్లేగు అంత భయంకరమైంది కాదని తర్వాత తెలిసింది. మందులతో ప్లేగును నయం చేయవచ్చు. సూరత్‌లో ప్లేగువల్ల చనిపోయింది 51 మంది మలేరియా, కలరాలవల్ల అంతకంటె ఎన్నోరెట్ల మంది చనిపోయారు సూరత్ పాలనా యంత్రాంగం పూర్తిగా విఫలమైంది. దానికి తోడు, స్థానిక రాజకీయ నాయకులు ప్లేగంటూ పట్టణంలో ఏదీలేదని ముందు బుకాయించారు. కాని బొంబాయిలో సూరత్ నుంచి వచ్చే వారిపై వైద్య పరీక్ష చేశారు బొంబాయిలో ప్లేగువల్ల ఎవరూ చనిపోలేదు. రెండు వారాల్లోనే మామూలు పరిస్థితి ఏర్పడింది భారతదేశ వార్తాపత్రికలు మేల్కొని వెంటనే సరియైన సమాచారాన్ని అందించాయి దాంతో విదేశీ ప్రసారాలు అనుగుణంగా స్తంభించాయి. 'ప్లేగు' అనే పేరుతోనే ఆ భయం కలిగింది తప్ప ''వ్యాధిక్రిమి'' వల్లకాదు. ఆ పదం బైబిల్‌లో వుంది అది జానపదాల్లో వుంది శాపనార్థాల్లో ఎక్కువగా వాడుతాం

అయితే, ఐరోపా జనాభాలో మూడోవంతు "Black Death' అనే వ్యాధివల్ల చనిపోయిన రోజుల్లో టెలివిజన్ లేదు. ఏంజరుగుతుందో తెలిపేందుకు వార్తా పత్రికలు లేవు ప్లేగును దూరంచేసే విధానాలు, దాన్ని గురించి ఎందుకు భయపడకూడదో చెప్పే ప్రసార సాధనాలు ఆనాడులేవు భారత దేశంలో 20వ శతాబ్దం మొదట్లో ప్లేగువల్ల, ఒకకోటి మంది చనిపోయారు ఇప్పుడు చనిపోయింది 51 మంది మాత్రమే! వ్యాధిని రెండు వారాల్లోనే కంట్రోలు చేశారు

అలాంటి సంఘటన, ఒక ఆసక్తి కరమైన పాఠాన్ని నేర్పుతుంది తన పురాతన సంప్రదాయాలను నిలుపుకుంటూ, ఆధునీకరణకోసం శ్రమించే సమాజం, ప్రపంచం కనుసన్నలనుండి తన యిక్కట్లను ఏమాత్రం దాచివుంచలేదు అయినప్పటికి ఆధునీకరణను, దేశం త్రోసివేయలేదు ఆ సంఘటన మొదట్లో కలిగించిన భయాగ్నికి వార్తాప్రసారాలు ఆజ్యం పోశాయి గత కాలపు ఆర్థిక వ్యవస్థనుండి మార్కెట్ శక్తుల ప్రపంచంలోకి అడుగేసేందుకు భయపడవచ్చు కాని అవే ప్రచార సాధనాల పుణ్యమా అంటూ తిరిగి

మామూలు పరిస్థితి నెలకొనడం జరిగింది. అదే విధంగా మార్కెట్ శక్తుల భయంనుండి కూడా బయటపడుతుంది.

రెండు వందల సంవత్సరాల ముందు పశ్చిమదేశాల్లో అధిక భాగం ఆధునికతకు దూరంలో వుండేవని మనం తెలుసుకోవాలి ఐరోపాఖండం, రోతగా, రోగగ్రస్తమై, విద్యాహీనమై వుండేది జీవనం అసహ్యకరంగా, అనాగరికంగా, అతితక్కువ ప్రమాణంలో వుండేది. అలాంటి ఐరోపా నేటి పరిస్థితికి ఎలా వచ్చింది? ప్రత్యేక నాగరికత వల్లనా? లేక మార్కెట్ శక్తులవల్లనా? ఒకదేశం మార్కెట్ శక్తుల అధీనంలో వుంటే, ఆ సమాజం, గట్టిబడి స్వయంగా క్రమశిక్షణ నలవరించు కుంటుంది పురాతన సాంప్రదాయ సమాజం నుండి అధునాతనంగా అభివృద్ధి అయ్యేందుకు మార్కెట్ శక్తులే కారణం

''తూర్పు'' 'పడమర'' అనే పదాలకు యీ రోజు చెప్పే అర్థం, 19వ శతాబ్దం వరకు తెలియలేదు 'పశ్చిమ' భావాలు వెల్లివిరిసిన 'హెల్లెనిక్' నాగరికత రోజుల్లో కూడా, వాటికి సాటిగల పదాలు లేవు ప్రపంచంలోనే ఒకనాడు సాటిలేని ఆధిపత్యంలో వున్న గ్రీసుకు, పశ్చిమ ఐరోపాతో కంటె, ఉత్తర ఆఫ్రికా, పర్షియా, వాయవ్య సరిహద్దు దేశాలు, భారతదేశంతోనే ఎక్కువ సంబంధాలుండేవి పశ్చిమ ఐరోపా దేశాలు గ్రీసు నుండి వుత్తరోత్తరా వుత్తేజం పొందాయి

ఇప్పటి గ్రీసు ఐరోపాలో వుంది పురాతన గ్రీసు భౌగోళికంగానూ, చారిత్రకంగానూ, ఐరోపాకు చెందలేదు గ్రీసు వారసత్వం పశ్చిమ దేశాలకే కాదు ప్రపంచం మొత్తానికి చెందినట్టిది. ఇప్పుడు అది పశ్చిమ దేశాలకు జీవన ధారగా పిలువ బడుతూ వుంది చరిత్రలో జరిగిన అన్యాయం, అతిక్రమణ యిప్పుడు ద్యోతక మౌతున్నాయి. నేటి యుగంలో ''పశ్చిమం'' అనే భావం 'స్వీయ అభినందన' సిద్ధాంతం నుండి ఎదురులేని వాస్తవంగా గుర్తింపబడింది ''తూర్పు'' భావన ఎన్నో శతాబ్దాల నుండి వుంది. 19, 20 శతాబ్దాల ఐరోపా వలస విధానంతోపాటు దాని రాజకీయ స్వభావం పెంపొందింది. ఒక సమయంలో ''తూర్పు'' అనేది నీచంగా పరిగణింప బడేది. ఎందుకంటె, చారిత్రకంగానూ, నాగరికతరీత్యా అంతకు మించి యితరత్రా పిలువబడేందుకు సాధ్యం కాలేదు. ''పశ్చిమం'' 'వున్నత' మైందనే భావన వుండేది . అది దృఢమైననైతిక విలువలపై ఆధారపడి వున్నట్లుగా భావించబడేది 'పశ్చిమం' ''మేము'' అని గర్వ కారణంగా వుండేది . వలస పాలకులకు అనాగరికులను ''వారు''గా అనిపించేవారు. ''తూర్పు'' భిన్నంగా వుండడమే కాదు, వారి అంతర్గత తర్కం, సూత్రాలు, 'పశ్చిమం' అర్థం కాని విధంగా వుండేది అయితే ''తూర్పు'' సాంస్కృతికంగానూ. ప్రమాణాల రీత్యా, అంతరంగిక పొందికతో తన సరిహద్దులో తనకు తాను సంపూర్ణంగా సంఘటితపడిన ప్రపంచం.

''తూర్పు'' మేధావులు వలస పాలనాధిపత్యం క్రింద ఎన్నో అవమానాలను ఎదుర్కొన్నారు దానికి ప్రతీకగా ''తూర్పు'' సిద్ధాంతంలో గొప్ప సుగుణాన్ని గమనించి 'పశ్చిమ' విలువలకంటే అదే గొప్పదని భావించారు. ''తూర్పు'' విలువలు ''పశ్చిమం'' విలువలకు పూర్తిగా భిన్నమైనవని చాలామంది వాదిస్తున్నారు. మలేషియా మహతీర్ మహ్మద్, సింగపూర్ లీకువన్ యు, యిలాంటి వారు 'ఆసియా' భావాన్ని సమర్థిస్తున్నారు అలాంటి వాక్చాతుర్యం వెనక, వారి ప్రభుత్వ రాజకీయావసరం వుండవచ్చు అయితే, చాలమంది పశ్చిమేతర మేధావులు యీ వివాదాన్ని సునిశితమైన దృష్టికోణంతో చూడవచ్చు

సింగపూర్‌కు చెందిన కిషోర్ బహుబూబాని 1993 సెప్టెంబర్, అక్టోబర్ "Foreign Affairs' పత్రికలో యీ విధంగా రాశాడు- ''మానవ నాగరికతా సంపద, విజయాల, కోశాగారంగా ''పశ్చిమం'' నేటికీ వుంది మానవుని అద్భుత పురోగమనాన్ని గురించి చాల 'పశ్చిమ' విలువలు వివరిస్తాయి. శాస్త్రీయ దృక్పథం, హేతువాద దృష్టితో పరిష్కారాలను కనుగొనడం కల్పనా భావాలకు సవాలును అంగీకరించడం లాంటి 'పశ్చిమ' విలువలు ముఖ్యమైనవి మొత్తంలో కొన్ని విలువలు హానికరమైనవి కావచ్చు కొన్ని మంచివి, కొన్ని చెడ్డవి కావచ్చు 'పశ్చిమం' బయట వుండి చూస్తేనేగాని స్పష్టంగా అవి కనబడవు అది తనచేతులారా, తన పతనాన్ని ఏ విధంగా కొనితెచ్చుకుందో కూడా తెలుస్తుంది ''

ఈ అభిప్రాయం ప్రకారం ''తూర్పు'' భవిష్యత్తులో ప్రపంచనాయకత్వం వహిస్తుందని వీరి ఆశాభావం!

**మార్కెట్ శక్తులు తమకు వుచితమైన మార్గంలో పయనిస్తూ వున్నప్పుడే, సాంస్కృతిక రాజకీయ వివాదాలు కొనసాగాయి. జపాను, మిగతా తూర్పు ఆసియా దేశాలు పురోగమించి సౌభాగ్యవంతం అయ్యేందుకు వారి ప్రత్యేక నాగరికతా విలువలు కారణం కాదు. కొన్ని ఆర్థిక మూల సూత్రాలను గుర్తించి అర్థం చేసుకొన్న వారి సామర్థ్యమే దానికి కారణం. అలాగే మిగతా ఆసియా దేశాల ఆర్థిక విధానాలు పై దేశాల వాటితో పోలివున్నాయి, అని ప్రపంచ బ్యాంకు తన 1993 రిపోర్టులో పేర్కొంది. మిగతా అభివృద్ధి చెందే దేశాలు కూడా ఈ మార్కెట్ ఆర్థిక విధాన మూలసూత్రాలను అవలంబిస్తే, సిద్ధాంతపరంగా అవి ఆధునీకరణ మార్గంలో సత్ఫలితాలను సాధించగలవు. కొన్ని ఆసియా దేశాలు ఆచరణ రీత్యా, ఆ మార్గంలోనే పురోగమిస్తున్నాయి. అయితే రాజకీయనాయకులు దాన్నుండి దృష్టిని మళ్ళించేందుకు సంస్కృతికి సంబంధించిన వాదానికి దిగారు. ఆ వాదనలలో, వుద్రేకాన్ని రెచ్చగొట్టే కుటుంబ విలువలు, సెక్స్ నీతి, అతి త్వరగా మారుతున్న ప్రపంచంలో ప్రాముఖ్యం వహించాయి.**

ఒక విషయాన్ని మనం దృష్టిలో వుంచుకోవాలి. ఐరోపా కూడా ఎల్లకాలం ఆధునికంగా వుండలేదు మార్కెట్ అవసరాల దృష్ట్యా తన రోజువారీ జీవన విధానం అనుభవాలు, నమ్మకాలు దెబ్బతింటున్నా వివిధ మార్గాల్లో ఆధునీకరణ దిశగా ఐరోపా సాగింది. 'కాలం' ప్రాముఖ్యాన్ని అది గుర్తించింది. ఆధునీకరణకు అది చాలా ముఖ్యం ఐరోపాలో పెట్టుబడిదారీ విధానం పెరిగే దశలోనే గడియారం కనుగొనబడిందేమో! కాలమే వ్యత్యాసాలను రూపుమాపే గొప్పశక్తి. అది క్రమశిక్షణను విధిస్తుంది లీ కువన్ యు కాలానికి ప్రాముఖ్యానిచ్చి దాన్ని గట్టిగా అంటి పెట్టుకొని వుండేవాడు. బహిరంగ స్థలాల్లో వుమ్మివేయడం లాంటి ఆసియన్ల పాత అలవాట్లను అసహ్యించుకొనేవాడు. అలా వూసేవారికి జరిమానా విధించి శిక్షించేవాడు. ఈ మధ్యకాలం వరకు ఐరోపాలో కూడా ప్రజలు బహిరంగ స్థలాల్లో వుమ్మివేసేవారు. ఇప్పుడు దానికోసం నగిషీపాత్రలను వాడుతున్నారు. ఆధునీకరణ జరిగేకొద్దీ మంచి ఆరోగ్యసూత్రాలు అలవడ్డాయి. ఆసియా దేశాలు కూడా ఆ దారిలోనే పోతూ ఉన్నాయి.

ఐరోపా అనుభవానికి, యిప్పటి ఆసియా అనుభవానికి ప్రత్యేకమైన తేడా వుంది. ఐరోపాలో పారిశ్రామిక విప్లవం ముందే మేధా విప్లవం వచ్చింది. జపాన్ యితర ఆసియా దేశాల్లో అది తలక్రిందులుగా వచ్చింది. ఇది రెండు ప్రపంచయుద్ధాల ఫలితం కావచ్చు. ఐరోపా సాధించినదాన్ని, పశ్చిమేతర దేశాలు ద్విగిణీకృతంగా సాధించాయి. ముఖ్యంగా జపానుదేశం ఎంతో సాధించింది. అభివృద్ధితో పాటు, జపాను, సాంప్రదాయ విలువల సామరస్యాన్ని సాధించింది. జపాను మేధా విప్లవం కొంత ఆలస్యమైందే తప్ప, అసలు రాకుండా పోలేదు. వ్యక్తివాదం పెరిగింది. దాంతో ప్రత్యేక జపాను పాత్ర రూపు మాసిపోయింది. క్లుప్తంగా చెప్పాలంటే, జపాను మార్పుమార్గంలో నిష్క్రమణకు తావులేదు.

జపాను సమాజం, దాని విలువలు వేగంగా పరిణామం చెందుతున్నాయి. జపాను, యింకా యితర తూర్పు ఆసియా దేశాల్లో స్త్రీ స్థానం మారుతూ వుంది. కుటుంబం, పనితీరులో మార్పు వచ్చింది పురుషాధిక్యత వున్న సమాజంలో, పూర్తిస్థాయి పొందాలంటే, స్త్రీలు యింకా చాలాదూరం ప్రయాణం చేయవలసి వుంది. అయినా, స్త్రీ అంతస్తులో మార్పు రావడంతో, కుటుంబ వ్యవస్థపైన, పురాతన సాంఘిక అవగాహనపైన పునఃవిచారణ జరుగుతూ ఉంది. పశ్చిమ దేశాల్లో కూడా కొంత కాలం క్రితం అదే జరిగింది. వీటన్నిటికీ మూలకారణం సాంకేతికాభివృద్ధి అని చెప్పకతప్పదు.

విలక్షణమైన నూతన ఆసియా సమాజం ఏ విధంగా పరిణామం చెందుతుందో చెప్పలేము. ప్రత్యేక ఆసియా సమాజమంటూ ఈ రోజున లేదు. నానావిధాల సాంస్కృతిక లక్షణాలు వున్న ఆసియా ఖండంలో చాలావరకు ఏకరూపంతో సులభంగా గుర్తుపట్టగలిగే ''ఆసియా విలువలు'' మాత్రం వున్నాయి. 21 శతాబ్దం తొలి సంవత్సరాల నాటికి, ఆసియా దేశాల్లో హాంకాంగ్, సింగపూర్‌ల లాగా పట్టణాలు పెరిగి 'ఆధునీకరణ'

కనిపించే అవకాశం వుంది. ఆసియాలోని యిప్పటి నగరాలు, పశ్చిమ దేశాలలోని నగర వాతావరణానికి అంతగా భిన్నమైనవి కావు. ''పశ్చిమ'' 'ప్రాక్' నగరాలన్నీ ఒకే నమూనాలో యిమిడి పోయాయి.

ప్రస్తుత పరిభాషలో మనం వివరించే ''భౌగోళిక గ్రామం'' అనేది 21 శతాబ్దం మధ్యకాలంలో ''భౌగోళిక నగరం''గా మారవచ్చు. ఎందుకంటే, మానవ నాగరికత చరిత్రలో గ్రామ నాగరికత నుండి నగర నాగరికతకు వృద్ధి చెందడం మన కాలంలో జరిగినంత వేగంగా యిదివరకెప్పుడూ జరగలేదు. దీనికి ప్రచార సాధనాల సహాయం ఎంతో వుంది. అప్పటికి, మనలో ఎవరైనా బ్రతికి వున్నట్లయితే, విభిన్న ప్రపంచాల గురించి, రెండు ప్రపంచాల కలయిక అసాధ్యమనే దాన్ని గురించిన వాదనలు విన్నట్లయితే, అవి మనకు పరిహాసంగా కనిపిస్తాయేమో!

అప్పటికి ప్రపంచం తన సమస్యలన్నీ పరిష్కరించలేకపోవచ్చు. చరిత్ర ముగింపుకు రాకపోవచ్చు. నూతన సంఘర్షణలు ప్రపంచాన్ని గడగడ లాడించవచ్చు. అప్పటి నగరాలు యిప్పటిమాదిరి, వాణిజ్యవాడలు, పార్కులు, మురికివాడలు, దేదీప్యమానకాంతులు, చీకటిదారులతో వుండవచ్చు. సమాజంలో జాతుల మధ్య, లేక భాషా, సంస్కృతుల మధ్య వచ్చే, వర్గభేదాలు, అపశ్రుతులు తొలగిపోవచ్చు. ఇప్పటి గందరగోళం నుండి బ్రతికి బయట పడితేనూ, పర్యావరణ, యితర విధ్వంసాల నుండి రక్షించుకోగలిగితేనూ, భౌగోళిక రీత్యా మనమంతా ఒకే విధమైన గమ్యాన్ని చేరవచ్చు. ఎందుకంటే, మార్గంలో ఎన్ని అడ్డంకులున్నా, వాటిని దాటి 'ఆధునీకరణ' ఒకే దిశకు సాగిపోతూ వుంది. మనం ఏమనుకున్నా ప్రపంచ ప్రసార సాధనాలతో ముందుకు సాగిపోయే మార్కెట్ విధానం వేరే విధంగా వుండదు.

ఈ వ్యాసానికి ప్రేరణ:

1. గౌతమ్ అధికారి జార్జి వాషింగ్‌టన్ యూనివర్శిటీలో వుపన్యాసము
2. Future Shock by Alvin Toffler
3. పర్యావరణ, కాలుష్యంపై గార్డియన్ వ్యాసము
4. Small is Beautiful - Schumacher
5. ఆంధ్ర దేశంలో సర్కారు జిల్లాల గ్రామాల్లో జరుగుతున్న ప్రచార సాధనాలు

## పాత కొత్తల వారధి

గతానికి, వర్తమానానికి అవినాభావ సంబంధముందన్నది ఎల్లరకూ విదితమే!

గతంలో కొందరు మేధావులు రచించిన విలువైన వ్యాసాలను నెలనెలా పాఠకులకు అందించాలని మా కోరిక. ఆ రోజులలోని సాహిత్య, రాజకీయ, విద్యా, సాంకేతిక విషయాలలోని ఆలోచనా ధోరణులను నేటి తరం వారికి తెలియజేయడమే ''మిసిమి'' అభిమతం.

ఆ ఉద్దేశ్యంతోనే ఈ సంచికలో 50 సం.లనాడు శ్రీ జి.వి. కృష్ణారావుగారు మార్క్సిస్టు దృక్పథంతో వ్రాసిన సాహిత్య వ్యాసాన్ని, 66 సం.ల నాటి ప్రముఖ పత్రికా సంపాదకులు శ్రీ ముట్నూరి కృష్ణారావుగారు పత్రికా ధోరణులను విశ్లేషించి వ్రాసిన వ్యాసం, 80 సం. నాడు శ్రీ అబ్బూరి రామకృష్ణరావు గారు వ్రాసిన 'కవిత్వం'ను ప్రచురించాము.

'ఘంటసాల పాట' ఎన్నిసార్లు వింటున్నామో గుర్తుంచుకోలేము – 'కన్యాశుల్కం' ఎన్నోసారి చదువుతున్నామో లెక్కించలేము కదా!

– సంపాదకుడు.

# కావ్యజగత్తు

''కావ్యజగత్తు (1944)'' నుండి — జి.వి. కృష్ణారావు

ఆధునికయుగం సాహిత్యసిద్ధాంతాల్లో ఒయ్యారాలు పోతూ వుంది. మున్నే యుగంలోనూ ఇప్పుడు వస్తూ వున్నన్ని సాహిత్య పద్ధతులు రాలేదు. ఈ నూతన సిద్ధాంతాలను పురస్కరించుకొని వస్తున్న సాహిత్యం నేటి పాఠకుడి కళ్ళకు బయర్లు కమ్మిస్తూ వుంది.

ఒకప్రక్కనుంచి కళకోసమే కళ అనీ, మరోప్రక్క నుంచి సాంకేతికవాద (Symbolism) మనీ, ఇంకా మరో దిక్కు నుంచి ఇంప్రెషనిజమనీ, పోస్టు ఇంప్రెషనిజమనీ, ఎక్స్ప్రెషనిజమనీ, ఇంకో దిక్కు నుంచి సర్రియలిజమనీ వస్తున్నాయి. కవిత్వాన్ని గూర్చి ఆలోచించదలచుకొన్నవాళ్లూ, సాహిత్యం వ్రాసేవాళ్లూ ఈ సిద్ధాంతాలు తప్పక తెలిసికోవాలి.

ఆధునిక సాహిత్య సిద్ధాంతాల్లో ముందు కళకోసమే కళ అనే పద్ధతి వచ్చింది. ఈ వాదమే సాంకేతికపద్ధతికి దారి తీసింది. తరువాతవచ్చిన ఇంప్రెషనిజాలు ఎక్స్ప్రెషనిజం, ఇమేజిజం, క్యూబిజం, ఫ్యూచరిజం, డాడిజం, సర్రియలిజం అనేవి సింబాలిజంలో నుంచి వచ్చినవే.

అసలు ఈ సిద్ధాంతాలనే ఉసుళ్ళపుట్ట 1860లో పగిలింది. కళకోసమే కళ అనే సాహిత్యపద్ధతి మొట్టమొదట ఫ్రాన్సులో బయలుదేరి వాల్టర్ పేటర్ అనే ఆంగ్లేయ విమర్శకుడి ద్వారా ఇంగ్లండుకు వ్యాపించింది. తరువాత ముప్పై సంవత్సరాలకు మన దేశానికి వచ్చింది. ఈ సిద్ధాంతం ప్రకారం కవితా ప్రపంచం భౌతిక ప్రపంచంతో సంబంధంలేక స్వతంత్రంగా ఉంటుంది. కేవలం కళాదృష్టితోనే కవితా ప్రపంచంలో విహరించాలి. కవితానుభూతి ఆత్మ ప్రకృతులకు భిన్నమైవుండే దేవుడిలాగ సామాజికసిద్ధాంతజీవికలకు భిన్నమై ఉంటుంది. కవిత్వం పేరుప్రతిష్ఠలకూ, ధనసంపాదనకూ, నీతి బోధించటానికీ కాక, కేవలం కళకోసమే ఉంటుంది.

ప్రస్తుతానికి ఈ వాదాన్ని ఒప్పుకుందాం. అయితే కవిత్వం ఎలా ఉంటుంది? మానవుడు తన జీవితాన్నుంచి విడివడి ఆలోచించగలడా? హృదయంలో అతనికి తెలియకుండానే లీనమైన అనుభవాలు కళను ఆనందించేటప్పుడు పనిచేయకుండా ఉంటాయా? అసలు అది సాధ్యమా? నిజంగా మానవుడు అలా చూడగలిగితే, ప్రాచీనతమములైన కళలను ఎందుకానందించ లేకపోతున్నాడు? ఈ ప్రశ్నలకు సమాధానం లేదు.

నేను కేవలం కళకోసమే వ్రాశానన్న ఆస్కార్ వైల్డు యొక్క 'పిక్చర్ ఆఫ్ డోరియన్‌గ్రే' కూడ జీవితంలోనించి బయలుదేరిందే. ఆ పుస్తకంలోనిది ప్రత్యేక ప్రపంచం కాదు. దానిలో ప్రాపంచిక జీవితం, శ్రేయస్సు, ఉన్నాయి. ప్రాపంచికానుభూతి గలిగిన పాఠకుడే ఆ పుస్తకాన్ని చదివి ఆనందించ గలుగుతున్నాడు కాబట్టి యీ వాదన నిలవదు

ఈ సిద్ధాంతం తరువాత వచ్చింది సింబాలిజం. దీనిప్రకారం కావ్యంలో చిత్రింపబడే అనుభూతి వ్యక్తికమనీ, దాన్ని శబ్దం ద్వారా ప్రకటించటానికి సాధ్యం కాదనీ, కేవలం నాదం వల్లను, రంగువల్లను, ఆకృతివల్లను (Form) స్ఫురింపజేయవలసినదేననీ చెబుతారు. ఇది ధ్వనిపద్ధతికి చాల దగ్గర్లో వుంది. రెండూ వాచ్యార్థంకంటె వ్యంగ్యార్థమే ముఖ్య మంటాయి. రెంటికీ ప్రమాత, అంటే రసికుడు, లేక సహృదయుడు కావాలి. అయితే ధ్వనికారుడి మతంలో కావ్యగతమైన అనుభూతి సాధరణీకరణాన్ని వరిస్తున్నది. సింబాలిజం ప్రకారం కావ్యానుభూతి కేవలం వ్యక్తికం. అందువల్ల శబ్దాన్ని తిరస్కరించి కేవలం నాదం మీద ఆధారపడవలసి వచ్చింది. కాబట్టే సింబాలిస్టు కవిత్వమంతా సాంకేతికమయమై చాలవరకు అర్థంకానిదైనది.

తరువాత వచ్చిన సిద్ధాంతాల్లో ఎక్స్ప్రెషనిజం ఒకటి ముఖ్యం. ఈ సిద్ధాంతం కాపిటలిస్టులు చెప్పే ఆధ్యాత్మికవాదంలోనుంచి మొలకెత్తింది. దీన్ని మొలకెత్తించింది క్రోచే అనే ఇటలీ దేశస్థుడు. ఈతని సిద్ధాంతం ప్రకారం జ్ఞానం రెండు విధాలు. ఒకటి ఇంద్రియాల ద్వారా లభించేది (Logical). రెండు ఇంద్రియాతీతమైనది (Intuitive). ఇంద్రియాతీతమైన జ్ఞానం దేశ, కాల, ఇంద్రియాలకు బద్ధమైనది కాదు. ఇది స్వయంజ్యోతి. ఇలాంటి ఇంద్రియాతీతమైన జ్ఞానమే కళ. ఈ కళ వ్యక్తికమైన అనుభూతులను ప్రకటిస్తుంది. ఇది మనస్సులోనే జరుగుతుంది. ఈ అనుభవం వ్యక్తికం కావటంవల్ల పునరుక్తం కాజాలదు. కళ దేశకాలబద్ధం కాని ఇంద్రియాతీత జ్ఞానం కావటం వల్ల క్షీణతాభివృద్ధులూ, న్యూనతాధిక్యాలూ లేని పరంజ్యోతి.

అంటే, కాళిదాస భవభూతుల కావ్యాలొక్కటే; నన్నయ తిక్కన కృతులు ఒక్కటే; పెద్దన తిమ్మన కావ్యాలూ ఒక్కటే. ఒకటి గొప్పది కాదు, రెండోది తక్కువదికాదు. ఈ మాటవింటే ప్రతిపాఠకుడూ, ప్రతివిమర్శకుడూ నవ్వుతాడు. కాని క్రోచే సిద్ధాంతమిదే.

నిజంగా కళనుగూర్చి అతడు క్రొత్త విశేషాలు ఏమన్నా చెప్పాడా అంటే, యిలా అన్నాడు : కళ అంటే ఇంద్రియాతీతమైన జ్ఞానం; అంటే వ్యక్తికానుభూతి ప్రకటన; అంటే సౌందర్యం సౌందర్యమంటే కళ. ఇలా నాలుగుస్తంభాలాట ఆడతాడు క్రోచే.

ఇక ఫ్యూచరిజం, డాడిజం కేవలం అరాజక సిద్ధాంతాలకు సంబంధించిన సాహిత్య సిద్ధాంతాలు. పూర్వ కావ్యాలను ధ్వంసం చేయటమే ప్రధానోద్దేశం. ఇవి పూర్వ కావ్యాలను అర్థం చేసుకోటానికికాని, రస స్వరూపాన్ని నిర్దేశించటానికి కాని పనికిరావు.

తరువాత సర్రియలిజం బయలు దేరింది. బోడితలకూ మోకాలికీ ముడిపెట్టినట్టుగా, ఈ సాహిత్య సిద్ధాంతం ఫ్రాయిడ్ సిద్ధాంతానికి, మార్క్సిజానికి లంకె వేసింది. రాజకీయరంగంలో మార్క్సిజమే ఆదర్శమన్నారు. శృంగారమే అన్నిటికీ మూలమనే ( దీనికి మన దేశంలో భోజుడు బీజం వేశాడేమో ననిపిస్తుంది) ఫ్రాయిడిజం స్వీకరించి అంతరాత్మకు అనుభూతిమీద పెత్తనమిచ్చారు. కావ్యానుభూతికి చమత్కారం, లేక అద్భుతం ముఖ్యమన్నారు. ప్రాచీనాలంకారికుడైన విశ్వనాథుడు రసానికి చమత్కారం, లేక అద్భుతం ప్రాణమని ఎప్పుడో చెప్పాడు. క్రొత్తదన మొక్కటే రసం కాజాలదు. పైగా, ఈ చమత్కారజీవి అయిన కావ్యాన్ని అంతరాత్మ శాసిస్తూ వుండటంవల్ల పాఠకుడు కావ్యాన్ని ఆనందించ లేకపోతున్నాడు. ఈ అంతరాత్మతో వ్యక్తిత్వం ఏకచ్ఛత్రాధిపత్యంగా ఏలుతూ వుంది. సాధారణీకరణం తొలగిపోతున్నది.

పైగా, ఈ సిద్ధాంతం కావ్య పరిణామాన్ని తెలుపలేకుండా వుంది.

ఈవిధంగా 1860నుంచి 1930 దాకా వచ్చిన యీ సిద్ధాంతాలు కలుపు మొక్కలు పెంచటానికి వచ్చినవే కాని పూర్వ కావ్యాలనుకాని, ఇప్పటి స్వరూపాన్నికాని, ముందు రాబోయే కావ్య స్వరూపాన్నికాని అర్థం చేసికొని ఆనందించటానికి తోడ్పడటం లేదు. ఇవన్నీ అహానికి ప్రాముఖ్యం ఇస్తూ వున్నాయి.

అయితే కవిత్వం యొక్క స్వరూపం ఎలా అర్థమౌతుంది ? దీనికి మార్గంఉందా? ఈ విషయమే ముఖ్యం.

శబ్దాత్మకమైన భాషతో కావ్యం నిర్మితమౌతుంది. ఏ సిద్ధాంతాలు ఎలా చెప్పినా, భాష సామాజికజీవనంతో వచ్చింది. సామాజిక జీవనం లేక భాష ఉండదు. పరస్పర అభిప్రాయాలు తెలిసికోవలసిన ఆవశ్యకం ఉన్నప్పుడే భాష ఉంటుంది. ఈ ఆవశ్యకం సామాజికజీవనం ఉన్నప్పుడే

వస్తుంది ఏ విషయాన్నైనా ఆలోచించటానికి, ఆలోచనాశక్తిని పెంపొందించటానికి భాషే ముఖ్యం. భాష లేకపోతే మానవుడు ఆలోచించ లేడు.

సామాజిక జీవనంతో ఉత్పన్నమైన భాష సమాజంతోపాటే మారుతూ వుంటుంది. శబ్దం నశించదనే మీమాంసకుల స్ఫోటకసిద్ధాంతాన్ని యీ విషయంలో ఆదరించటానికి వీల్లేదు. పూర్వపు తెలుగు ఇప్పటి కెంత నాశనమయింది? తెలుగులో తూర్పు పడమర శబ్దాలున్నాయి; తతిమ్మా రెండు దిక్కుల్నీ తెలియజేసే శబ్దాలు నశించాయి.

అసలు కళ అనేదికూడాసామాజిక జీవనం ఉన్నప్పుడే ఉంటుంది. సామాజిక జీవనం లేకపోతే కళ అనేదే వుండదు చీమలూ, తేనెటీగలూ సామాజిక జీవులు కాబట్టి వాటికి కళ ఉంది. జూలియన్ హక్ల్సీ చీమల్నిగూర్చి వ్రాస్తూ, సామాజికజీవులు కాబట్టి వాటికి కళ ఉన్నదన్నాడు.

మానవుడు సామాజికజీవి కానట్లైతే, భాష, కళ, కావ్యం ఉండేవి కావు. వ్యక్తిత్వం ఉండేదికాదు. అతడు జంతువులాగానే, కేవలం శారీరకంగానే, ఇతరుల కంటె భిన్నుడుగా కనిపించేవాడు. కళకూ, కవిత్వానికీ హేతుభూతమైన సమాజం ఎల్లకాలం ఒక్కరీతిగా ఉండదు. దీన్ని అంతా అంగీకరిస్తారనుకుంటాను. ఈ సమాజంతోపాటే మానవుడి అనుభూతి మారుతూ వుంటుంది. క్రొత్త అనుభూతితో ప్రాత అనుభూతి మీద మానవుడు కొంతవరకే సానుభూతి చూపించగలడు. ఈ సానుభూతి రెండనుభవాల భేదాన్ని బట్టి వుంటుంది. వెనకటిరోజుల్లో, ఆనాటి సమాజానికి ఋగ్వేదం కావ్యం. ఈరోజున దానిలోని ఋక్కులకు అర్థం చెప్పుకోగలిగినా, కవిత్వమని ఆనందించలేము ఈ విషయ మన్ని కళలకూ అన్వయిస్తుంది. ప్రాచీన కాలంలో చిత్రకారుడు లేడిని రెండుకాళ్ళతోనే చిత్రించాడు ఆ బొమ్మను చూచి ఆనందించటం మనవల్ల సాధ్యపడుతుందా?

ఈ అనుభూతి భేదంవల్లనే పూర్వ కావ్యాల్లోని ఒక ప్రత్యేకరసం ఆధునికులకు మరొకరసం కావచ్చును నాచనసోముడు వ్రాసిన ఉత్తర హరివంశంలోని ''జడలు కంపలువట్టి జరుగనీకున్న'' అనే సీసపద్యం రాళ్లపల్లి అనంతకృష్ణ శర్మగారికి నవ్వు తెప్పించింది. నిజంగా ఆ పద్యం కేవలం కరుణరసఘట్టం లోనిది

మరో విషయ ముంది మొట్టమొదటి కావ్యాల్లో హాస్యం అట్టే కనిపించదు. ఆ రసం మానవ సమాజంతో అభివృద్ధి చెందుతూ వస్తున్నది అందుకనే ప్రాచీనాలంకారికులు గ్రీసు దేశస్థులుకానీ, మన దేశస్థులుకానీ- హాస్యానికి ప్రాముఖ్యం ఇవ్వలేదు.

కాగా, ఒకటి . కళనుగాని, కవిత్వాన్నిగాని సంఘాన్నుంచి విడదీయటానికి వీల్లేదు. రెండు · మానవసమాజం మారుతూ వుంది సమాజంతోపాటు భాష, అనుభూతి, కావ్యం మారుతూ వస్తున్నాయి. ఈ మార్పును అంగీకరిస్తేనేకాని అన్ని యుగాల కావ్యాలనూ అర్థం చేసుకోటానికి కాని, కవిత్వతత్త్వం కొంత గ్రహించటానికి కాని వీలులేదు.

అయితే, సమాజం ఎందుకు మారుతున్నది? ఇదివరకు ఎలా మారింది? ఇకమీద ఎలా మారుతుంది? ఈ విషయాలను తెలిసికొంటే కవిత్వం సంగతి కూడా తేలుతుంది.

ఈ మార్పును వివరించ గలిగింది చారిత్రిక భౌతిక సిద్ధాంత మొక్కటే. కొంతమంది మార్క్సు చెప్పిన యీ సిద్ధాంతం సాహిత్యానికి ఏ మాత్రమూ అన్వయించదంటారు ఇది పొరపాటు సూడో మార్క్సిస్టుల్లాగా భౌతిక సిద్ధాంతాలను అన్వయిస్తే ప్రయోజనం లేదు.

# ఆచార్యనాగార్జున : మధ్యమకకారిక

## ప్రథమ పరిచ్ఛేదం-ప్రత్యయపరీక్ష

-రాజగోపాలరావు

చత్వారః ప్రత్యయా హేతుశ్చాలంబన మనంతరం
తథైవాధిపతేయంచ ప్రత్యయోనాస్తి పంచమః॥

ప్రత్యయాలు నాలుగు - హేతువు, ఆలంబనం, అనంతరం, అధిపతి. అయిదో ప్రత్యయంలేదు.

ప్రపంచ పదార్థాలను యథార్థాలుగా పరిగణిస్తూ అవి కార్యకారణ సంబంధం ద్వారా ఉత్పత్తి అవుతాయంటూ కార్యకారణాలు ఒకే పదార్థ పరిణామాలుగా వివరించే సాంఖ్యుల సత్కార్యవాద పర్యవసానమయిన స్వతోత్పత్తినీ; కారణానికి భిన్నంగా కార్యముత్పత్తి అవుతుందనే వైశేషికుల ఆరంభవాద పర్యవసానమయిన పరతోత్పత్తినీ పరీక్షించి ఉత్పత్తి అవుతాయనుకొనే పదార్థాలు స్వతహాగాగానీ, పరతహాగాగానీ, రెండు విధాలుగాగానీ, అహేతుకంగాగానీ ఉత్పత్తి అయే అవకాశమే లేదు కనుక అటువంటివెప్పుడూ ఎక్కడా ఉండవని వివరించి, ఆవిధంగా పదార్థాలు ఉత్పత్తి అవుతాయనటాన్ని పూర్తిగా తిరస్కరించాడు ఆచార్యుడు.

ప్రపంచ పదార్థాలు యదార్థాలుగావంటూనే కార్యకారణ ఉత్పత్తిని తిరస్కరిస్తూనే ప్రత్యయాల ద్వారా ఉత్పత్తి జరుగుతుందనే హీనయానుల (విభాజ్యవాదులు[1], ఆభిధార్మికులు[2], సర్వాస్తివాదులు[3], సౌత్రాంతికులు[4]) వివరణను రెండో కారికలో పరీక్షిస్తున్నాడు. బుద్ధుడు పదార్థాలనెవరో సృష్టిస్తారనటాన్నిగానీ స్వతహాగానో, పరతహాగానో ఉత్పత్తి అవుతాయనిగానీ అంగీకరించడని వారు గూడా అంగీకరిస్తారు. బుద్ధుడు అహేతుకవాది[5] కాడు. పదార్థాలు అకస్మాత్తుగా ఆకాశం నుంచి ఊడి పడతాయనడు. పదార్థాలన్నీ ప్రత్యయుత్పన్నాలన్నాడు. 'ఈ ప్రత్యయం నుంచి ఈ ఉత్పత్తి జరుగుతుంది' (ఇదంప్రత్యయతావాదం) చూడండి అంటూ సోదాహరణంగా వివరించాడు. ఆ ఇదం ప్రత్యయతావాదమే ప్రతీత్య సముత్పాదంగా ప్రతిపాదితమయింది. ఆవిధంగా బుద్ధుడు ప్రత్యయుత్పత్తిని అంగీకరిస్తాడంటారు. దానినే బుద్ధఘోషుడు- ''ప్రపంచ నిరంతర సంభవనానికి దేవుడో, బ్రహ్మో కారణం కాదు. హేతు సంఖార ప్రత్యయాల ద్వారా ప్రపంచంలో ధర్మాలు ప్రవర్తిస్తుంటాయి''- అంటూ వివరించాడు[6]. బౌద్ధం ప్రాథమిక స్థాయిలో (హీనయాన) ఆవిధంగా ప్రపంచ పదార్థాలను వివరించటాన్ని ప్రమాణంగా అంగీకరిస్తూ ''అతీత శక్తుల మీద ఆధారపడకుండా ప్రపంచ యథార్థాలను, అనుభవాలను వివరించటం వల్లనే బుద్ధుడు హేతువాది అవుతాడంటాడు రాధాకృష్ణన్[7]. బుద్ధుని సహేతుక వివరణనుగానీ, అనవసరమయిన విషయాలమీద చర్చలను అప్రయోజకాలుగా (అవ్యాకృతాలుగా) తిరస్కరించి అత్యవసరమయిన ఆనుభవిక అంశాలవైపు దృష్టి మళ్లించటాన్నిగానీ, దుఃఖాన్ని అత్యంత ప్రధాన అంశంగా గ్రహించటాన్నిగానీ ఎవరూ కాదనలేరు. అయితే బుద్ధుని ఉపదేశాన్ని అర్థం జేసుకొని వివరించటంలోనే అభిప్రాయ భేదాలు బయలుదేరాయి- బౌద్ధం శాఖోపశాఖలుగా చీలిపోయింది.

హీనయాన బౌద్ధులు బుద్ధుని ఉపదేశమందించే పదాలకు అత్యంత ప్రాధాన్యమిస్తారు. ఆ పదాలను విభజించి విశ్లేషించి వాటి ద్వారా ప్రతిపాదితమయ్యే సూక్ష్మ ధర్మాలను యథార్థాలుగా గ్రహించి అవి అనుక్షణమూ పొందే నిరంతర పరివర్తనను నిరూపించి ప్రపంచ పదార్థాల అయథార్థతను నిరూపించటానికి ప్రయత్నిస్తారు. అవిద్యా మూలకంగా సాగే ఈ పదార్థ క్షణిక ఉత్పత్తిలయాలు ఏవిధంగా పరస్పరం ఆధారపడుతూ ఉంటాయో ప్రతీత్య సముత్పాద విశ్లేషణద్వారా వివరిస్తారు. ప్రతీత్య సముత్పత్తి ప్రత్యయాల ద్వారా సంభవించే ఉత్పత్తి కనుక వారి వివరణలో ప్రత్యయం ప్రముఖ స్థానమాక్రమిస్తుంది.

ముందుగా ప్రత్యయం కారణంగాదనే విషయం స్పష్టంగా గ్రహించుకోవలసి ఉంటుంది. హీనయానులు గూడా మూలము-హేతువు-కారణం-నిదానం-ప్రత్యయం వంటి పదాలను సమానార్థకాలుగానే ప్రయోగిస్తారు. అయితే వాటికి ఎటువంటి శాశ్వతత్వమూ ఉండదు. అవి అన్నీ క్షణికంగా సంభవించే ప్రతీత్య సముత్పత్తిలో క్షణికంగా ఉండే ఆధారాలే. యథార్థవాదుల కార్యకారణ వాదంలో కార్యమూ శాశ్వతమవుతుంది, కారణమూ శాశ్వతమవుతుంది. వాటి సంబంధమూ శాశ్వతమవుతుంది. అదే కారణం నుంచి అదే కార్యం (ఫలితం) రావలసి ఉంటుంది. అదే ఫలితానికెప్పుడూ అదే కారణం మూలం గావలసి ఉంటుంది. ఆవిధంగా యథార్థవాదుల కార్యకారణ వాదంలో కార్య, కారణాలు- వాటి సంబంధాలు నిశ్చితాలు, నిర్ణీతాలు అయిపోతాయి. అయితే హీనయాన బౌద్ధుల ప్రత్యయాలకు వాటి నే పేరుతో పిలిచినా- అటువంటి నిశ్చితత్వముండదు. ప్రపంచంలో సంభవించే ప్రతీత్య సముత్పత్తి సంబంధాల వివరణకు గాను వారు 24 ప్రత్యయాలను అంగీకరిస్తారు[9]. సందర్భాన్నిబట్టి అవసరాన్నిబట్టి ఆయా పరిస్థితులలో అవి ఉత్పత్తికి ఉపకరిస్తాయి, అటు తరువాత అంతరించిపోతాయి. ఆ ప్రత్యయాలనుంచి అవే ఉత్పత్తులు సంభవించి తీరాలనే శాశ్వత సంబంధమేమీ వాటి మధ్య ఉండదు.

హీనయానులు ''ప్రత్యయ'', ''ప్రతీత్య'' పదాలను సమానార్థకాలుగానే ప్రయోగిస్తారు. ప్రత్యయపదాన్ని ప్రతి+అయగా, ప్రతీత్యపదాన్ని ప్రతి+ఇత్యగా విడదీసి ఉత్పత్తికి ఆధారమయే మూలధర్మంగా వివరిస్తారు. ఉత్పత్తికి ఉపకరించేది ప్రత్యయం. ప్రత్యయ-ఉత్పత్తుల మధ్య సన్నిహిత సంబంధముంటుంది. ప్రత్యయం లేకుండా ఉత్పత్తి జరుగదు. ఉత్పత్తి సంభవించని ధర్మం ప్రత్యయం గాబోదు. ఆ సంబంధంవల్లనే ప్రత్యయాన్ని ప్రత్యయ ధర్మమంటారు, ఉత్పత్తిని ప్రత్యయుత్పత్తి ధర్మమంటారు. వాటి సంబంధమే ప్రతీత్య సముత్పత్తి. ప్రతీత్య సముత్పాదాన్ని ప్రతీత్య-సమ్-ఉత్పాదంగా విడదీసి ప్రత్యయంవల్ల - దానితో కలిసి (సమ్) సంభవించే ఉత్పత్తిగా వివరించి ప్రత్యయ-ఉత్పత్తుల మధ్య ఎటువంటి అంతరమూ ఉండదని వివరించటానికి ప్రయత్నిస్తారు. ఆవిధంగా ప్రత్యయం ఉత్పత్తికి దోహదం జేస్తూ తనతోపాటు కొనసాగేవిధంగా వర్తిస్తుంది. అందువల్లనే అనుక్షణమూ ఉత్పత్తి భంగాలకు లోనయే ధర్మాలు నిరంతరంగా అవిచ్ఛిన్నంగా కొనసాగుతున్నట్లుగా కనిపిస్తాయని హీనయానులు వివరిస్తారు. ఆవిధంగా ప్రత్యయ-ఉత్పత్తి, ప్రతీత్యసముత్పత్తి ప్రపంచ పరివర్తనాత్మకతను ప్రదర్శిస్తూ బుద్ధుడు భావించిన ప్రావాహికతకు ప్రతిరూపమవుతుందంటారు. అంతేకాక తీవ్రవాదాలను పరిహరించి బుద్ధుని మధ్యే మార్గానికి ప్రాతినిధ్యం వహిస్తుందంటారు. ప్రతీత్య సముత్పాదంలోని ''ప్రతీత్య'' పదం శాశ్వత అహేతుక[10] విషమహేతు[11], వశవర్తివాదాల[12] వంటి తీవ్ర వాదాలను తిరస్కరిస్తే ''సముత్పాదం'' అనే పదం నాస్తిక[13], ఉచ్ఛేద[14], అక్రియావాదాలను[15] తిరస్కరిస్తుందని వివరిస్తుంది 'విశుద్ధిమగ్గ'[16].

ఆవిధంగా ప్రత్యయాలు హీనయానంలో ప్రముఖ స్థానం పొందుతాయి. వారంగీకరించిన 24 ప్రత్యయాలలో ఉత్పత్తికి అత్యంత ప్రధానాలుగా నాలుగు ప్రత్యయాలను - హేతువు, ఆలంబన,

సమనంతర, అధిపతిప్రత్యయాలను- అభిధార్మికు లంగీకరించారు. ఆ సంప్రదాయాన్నే సర్వాస్తివాదులు కొనసాగించారు[17]. ధర్మాల/ క్షణిక ఉత్పత్తి స్థితి/ లయాలకు ఆధారంగా వాటిని స్వీకరించారు.

సముత్పత్తి అవిద్యతో ప్రారంభమవుతుంది. అంటే ఈ ప్రపంచమూ దానిలో పదార్థాలు- ధర్మాలు- ఉత్పత్తి స్థితి లయాలు అన్నీ అవిద్యామూలకాలే. అంటే అజ్ఞానం వల్ల యథార్థాలుగా గ్రహించుకొనేవే. దానిలో ఒక అంశమే ప్రత్యయ ధర్మాలు, ప్రత్యయుత్పత్తులు- వాటి పరస్పర సంబంధాలు హేతువును ఉత్పత్తికి మూలమనే అర్థంలో స్వీకరించారు[18] అది ఉత్పత్తిని సంభవింపజేస్తుంది (నిర్వర్తకం). ప్రత్యయధర్మం ఉత్పత్తి ధర్మాన్ని సంభవింప జేయటం వల్ల హేతు ప్రత్యయమవుతుంది ఏ ఉత్పత్తి అయినా ఇతర పదార్థాల మీద ఆధారపడితే ఆ పదార్థం ఆలంబన ప్రత్యయం చక్షుర్ జ్ఞానానికి రూపం ఆధారమవుతుంది ఆవిధంగా రూపం ఆలంబన ప్రత్యయమవుతుంది ఉత్పత్తి ధర్మం సంభవించగానే ప్రత్యయధర్మం నశించిపోతుంది మొలకెత్తగానే విత్తనం నశించి పోతుంది. అయినా అది మొలకలో కొనసాగుతుంది అందువల్లనే వేపవిత్తనం నుంచి వేపమొక్క వస్తుంది. అది వేపచెట్టే అవుతుంది. ఆవిధంగా కొనసాగటం అనంతర ప్రత్యయం. ప్రత్యయాలన్నీ సమన్వయాత్మకంగా ఉత్పత్తి సంభవించటానికి ఉపకరించేది అధిపతి ప్రత్యయం[19]. ఈ నాలుగు ప్రత్యయాలను ప్రధానాలుగా అంగీకరించి మిగిలినవాటిని వాటిలో అంశాలుగానో అనుబంధాలుగానో పరిగణించారు. ఈ ప్రతీత్య సముత్పత్తి ఆద్యంత రహితంగా కొనసాగుతుందని గుర్తుంచుకొన్నప్పుడు ప్రపంచంలో ప్రతి అంశమూ సంస్కారరూపంలో కొనసాగుతూ ఉత్పత్తిలయాలకు ఆధారమవుతుందనే అవగాహనం గలుగుతుంది

ఈవిధంగా అన్నిటినీ ధర్మాలుగా విశ్లేషించి వాటి నిరంతర సంక్రమణాన్ని ప్రత్యయ - ప్రత్యయుత్పత్తి ధర్మాల ద్వారా వివరిస్తూ అదే బౌద్ధ ధర్మ ప్రతిపాదకమవుతుందనటమెంతవరకు సమంజసమో ఆచార్య నాగార్జునుడు పరీక్షిస్తున్నాడు''

**కవిత్వము**- అబ్బూరి రామకృష్ణరావు

తీవ్ర తరమగు గ్రీష్మసందీప్తి కలన
సస్యహీనమ్ములయిన భూస్థలుల రీతి,
అగ్ని సంతప్తమైనగృహమ్ము భాతి
చందురుడు లేని యా యాకసమ్మువోలె,
ఇతరుల సుఖమ్ముల సమన్వయింపలేక,
రాలనైనను గరగింపఁ జాలు నట్టి
గద్గద శ్రుతి మృత్యులోకమ్ముఁ జేర,
నీడ్వబడు జంతువులఁ గని యేడ్వలేక
ధన మదము చేత మత్తిల్లు మనుజకోటి
నాశ్రయించుట హేయమౌ ననగలేక
మృదుల గళముల నెత్తి కోయిలలు పాడు
గీతముల కర్థముం జెప్పఁ జేతగాక
దినదిన మపూర్వమై తోచు దినక రోద
యంబు వెలిబుచ్చునట్టి సోయగముఁ గాంచి
సమ్మదాశ్రు కణముల రాల్పఁగఁ లేక
ధరణిపైఁ జల్లు చిన్న విత్తనముఁ జూచి
లేత కాంతుల సాచు వల్లికను జూచి
పర్ణముల డాగు మొగ్గ జొంపములఁ జూచి
స్పర్శమాత్రన కందు మవ్వమ్ము లరసి
దశ దిశామోద రచిత మోదనముఁ జూచి
ప్రసవ పరిమళమును గొంత వడి ధ్రుశించి,
క్రొత్త భావమ్ములన్‌గయికొనగలేని
హృదయములతోడ కవితా పరిశ్రమలను
జేయు వారల హస్తంబుఁ జేరనీవు
చూపు దైన్యంబుఁ గన్నారఁ జూచినాడ
చకితవై నీవు నిల్చిన సరణి గాంచి
లేఖినీ! విస్మయమునఁ జలించినాఁడ!

కృష్ణాపత్రిక, 1914 సెప్టెంబర్ 26

Printed, Published and Edited by ALAPATI RAVINDRANATH at Kala Jyothi ProcessLtd,
1-1-60/5, Iftekar Mansion Lane, RTC X Roads, Musheerabad, Hyd-20
Ph 7612436, 7612337

Editorial NEST
Plot No 337-A, Road No. 10, Jubilee Hills, Hyderabad-500 033. Phone 247717

MISIMI/మిసిమి RNI Regd.No:45042/90 Telugu Monthly, Hyderabad-500 020

Postal Regd.No.H/SD/191

